# బిందుగారబ్బాయి

శరత్‌బాబు

అనువాదం
శివరామకృష్ణ



దేశికవితా మండలి
గవర్నర్‌పేట... విజయవాడ.2.

దేశీ ప్రచురణ
నాలుగవ ముద్రణ
జనవరి — 1955
వెల: ముప్పావలా.

దేశికవితా
ముద్రణాలయం
విజయవాడ-2.



సంపాదకులు:
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

# బిందుగారబ్బాయి

యాదవుడూ, మాధవుడూ సవతిబిడ్డలన్న సంగతి వారే కాకుండా లోకులుకూడా మరచిపోయారు. బీదవాడైనా యాదవుడు చాలా కష్టపడి తమ్ముడు మాధవుడికి బి. యల్ దాకా చదువు చెప్పించటమే కాకుండా ఎన్నో ప్రయత్నాలు చేసి ఒక మహాధనికుని కూతుర్ని—'బిందువాసిని'ని తనకు మరదలిగా తెచ్చుకోగలిగాడు. ఆ మహాధనికునికి బిందువాసిని ఏకైక పుత్రిక. అసాధారణ సౌందర్యరాశి. అంత అందమూ, పదివేల రూపాయల కట్నమూ తీసుకుని బిందువాసిని వచ్చిన రోజున ఈ ఇంటిపెద్దకోడలు అన్నపూర్ణ కళ్ళల్లో ఆనందాశ్రువులు నిండినాయి. ఇంట్లో అత్తగారుగాని, ఆడబిడ్డలుగానీ ఎవరూ లేరు. అన్నపూర్ణే ఇంటిపెద్ద. ఆమె చిన్న తోడికోడలు గడ్డంపైకెత్తి "ఇంటికోడల్ని తెచ్చుకుంటే ఇటువంటి పిల్లను తెచ్చుకోవాలి. లక్ష్మీస్వరూపం" అని అమ్మలక్కలందరితో సగర్వంగా చెప్పుకొన్నది. కాని రెండురోజులలోనే ఇది పొరపాటని తేలిపోయింది. చిన్నకోడలు తెచ్చిన అందానికీ, డబ్బుకూ నాలుగురెట్లు అహంకారమూ, అభిమానమూ వెంటబెట్టుకు వచ్చిందని తేలిపోయింది. ఒకరోజున పెద్దావిడ భర్తను చాటుగా పిలిచి, "రూపాన్ని రూపాయలనూ చూచి మురిసి చేసుకున్నారుగాని, ఈ పిల్ల అచ్చంగా తాచుపిల్లండీ" అని అన్నది.

శ్రీ [illegible]
[illegible]. ([illegible] జిల్లా)

యాదవుడు ఈమాట నమ్మలేదు. తల గోక్కుంటూ, మూడు నాలుగుసార్లు "ఆఁ అలాగా! అలాగా" అని కచేరీకి వెళ్ళిపోయాడు.

యాదవుడు చాల నెమ్మదైన మనిషి. జమీందార్ గారి కచేరీలో సముద్దారుపని, ఇంటివద్ద పూజార్చన కూడా చేస్తుంటాడు.

మాధవుడు అన్నకన్న పదేళ్లు చిన్న. ప్లీడరీ ప్యాసయి ఇప్పుడే ప్రాక్టీసులో ప్రవేశించాడు.

అతను వచ్చి "ఏం వదినా! అన్నగారికి డబ్బే ఘనమై పోయిందే! రెన్నాళ్లు ఓపికపడితే నేనూ సంపాయించుతాగా! ఆయనకు సంతృప్తి కలుగుతుంది" అన్నాడు.

అన్నపూర్ణ మాట్లాడలేదు.

ఇది ఇలావుండగా మరో విపత్తు వచ్చిపడింది. చిన్నకోడలిని ఎవరూ ఏమీ అనటానికి వీలులేదు. ఆమెకు పెద్ద మూర్ఛ రోగము వుంది. మూర్ఛ వచ్చినప్పుడు ఆమెకేసి చూస్తే ఇంటిల్లిపాదీ గజగజ లాడిపోతారు. డాక్టర్ని పిలవటం తప్ప మరో ఉపాయం లేదు.

ఈ సంబంధం చేసుకోవటం పొరపాటని అందరి మనసుల్లోనూ నాటుకుపోయింది. యాదవుడు మాత్రం అందరికంటె భిన్నంగా నిలబడి "అలాకాదు, రెన్నాళ్లుంటే మీకే తెలిసి వస్తుంది. మా మరదలు ధాత్రీస్వరూపిణి. ఇంత అందము నిష్ఫలమై పోతుందా? ఎప్పటికీ కాదు" అని అంటూ వుండేవాడు

బిందు ఒకనాడు ఏదో మాటపట్టింపుతో మొహం ముడుచుకుని కూర్చుంది. ఇదిచూచి అన్నపూర్ణ ప్రాణా లెగిరి పోయినాయి. హఠాత్తుగా ఆమెకు ఏమి తట్టిందోకాని చప్పున గదిలోకి పరుగెత్తుకెళ్ళి నిద్రపోతున్న తన ఏణ్ణాధంబిడ్డ అమూల్య చరణుని తీసుకొచ్చి బిందువాసిని వళ్ళోపడేసి పోయింది. బిందు వాసిని ప్రాణాలు బిగపట్టి మూర్ఛనుండి తెప్పరిల్లి కుర్రవాణ్ణి చంకనేసుకొని గదిలోకి వెళ్ళిపోయింది.

చాటునుండి అన్నపూర్ణ ఇదంతా చూస్తూనే వుంది. బిందువాసిని జబ్బుకు మహా దివ్యౌషధాన్ని కనిపెట్టినందుకు వుప్పొంగిపోయింది.

సంసారభారమంతా తన నెత్తిమీదనే ఉండటంవల్ల అన్నపూర్ణ బిడ్డను సరిగా సాకలేకుండావుంది. పగలల్లా పని పాటలు చేసుకున్నాక రాత్రి నిద్రపోకపోతే జబ్బుచేస్తుంది ఆమెకు. అందుచేత చిన్నకోడలు బిడ్డభారమంతా తను వహించింది.

నెలరోజులిలా గడిచాక, ఒకనాడు ప్రొద్దున బిందు వాసిని బిడ్డను చంకనేసుకుని వంటింట్లోకి వెళ్ళి, "అబ్బాయి పాలేవి అక్కాయి!" అన్నది.

అన్నపూర్ణ గభాలున చేతిలోపని పారేసి, "ఒక్క క్షణం ఆగమ్మా, ఇప్పుడే కాగబెట్టి యిస్తాను!" అన్నది భయ పడుతూ.

బిందు వంటింట్లో అడుగుపెట్టగానే చూచింది, పాలు కాగబెట్టకుండా ఒకమూల వుండటం. మండిపడి, "ఎనిమిది

గంటలలోపలే పాలుకాచి సిద్ధంగా వుంచాలని నిన్నకూడా మీతో చెప్పాను. ఇప్పుడు తొమ్మిది కావచ్చింది ఈ పని మీకంత భారమైతే ఆ సంగతి మీరు నాకు స్పష్టంగా ఎందుకు చెప్పరు? నేనింకో ఏర్పాటు చేసుకుంటాను. ఏమన్నా వంట లక్కా? ఇంటిల్లిపాదికీ వుడకవేసి పెట్టటానికి తొందరొచ్చిందా? కొంచెం ఆలస్యమైతే మాత్రం ఏమిపోయింది. నీకా మాత్రం తెలివి వుండనవసరంలా!" అన్నది పుల్లవిరుపుగా.

వంటలక్క మాట్లాడలేదు.

"నీలాగ మాకూ పిల్లాడికి బొట్టూ, కాటుక పెట్టడమే పనైతే జ్ఞాపకముండేదే. ఇంకొక్క క్షణం ఓపికపట్టమన్నా" అన్నది అన్నపూర్ణ.

"ఇహనుంచి నీవుగనక అమూల్యుని పాలు ముట్టుకున్నానంటే నామీద వట్టు, నేను గనక వాడి పాలమాట నీతో చెప్పానంటే నీమీద వట్టు" అన్నది బిందువాసిని సమాధానంగా.

అని బిందు కుర్రాణ్ణి ఒక్కసారి కిందకూ జేసి పాలగిన్నె తీసుకుని పొయ్యిమీద పెట్టింది. ఈ అచింతనీయ సంఘటనకు అమూల్యుడు ఏడవటం మొదలుపెట్టాడు. అదిచూచి బిందు వాడి బుగ్గలు నొక్కి "నోరుముయ్యి వెధవా! నోరెత్తావంటే గొంతు పిసుకుతా" అన్నది బెదిరించుతూ. ఇది చూచి దాసీది పరుగెత్తుకువచ్చి కుర్రాణ్ణి తీసుకోబోయేప్పటికి "ఛ, నువ్వు అవతలికి పో" అని గదమాయించింది. ఆ గదమాయింపుతో

దాసీని ఇంకొక అడుగు ముందుకు వెయ్యలేక నుంచున్నది నుంచున్నట్లే వుండిపోయింది.

బిందు ఇంకేరితో ఏమీ మాట్లాడకుండా కక్కటిల్లి ఏడుస్తున్న బిడ్డను దగ్గరకు తీసుకుని పాలుకాచటం మొదలెట్టింది.

అన్నపూర్ణ అలాగే నిలబడిపోయింది. పాలు కాచుకుని బిందువాసిని అక్కడనుంచి వెళ్ళిపోయిన తర్వాత "విన్నావా ఆమె మాటలు. ఒకనాడు నవ్వుతాలకి అన్నాను, అమూల్యుని నీవు పెంచమని. ఆ ఆసరాతో నాకు ఎలా వట్టుపెట్టిందో చూశావా?"

ఎలా అయితేనేం? అన్నపూర్ణ బిడ్డ బిందువాసిని వడిలో పెరుగుతూ, పిన్నిని 'అమ్మా' అనీ, అమ్మను 'అక్కా' అని పిలవటం నేర్చుకున్నాడు.

౨

నాలుగేళ్ళు గడిచినాయి. మహాడంబరంతో అమూల్యునికి అక్షరాభ్యాసం చేశారు. ఆ మరునాటి ఉదయం అన్నపూర్ణ వంటపనుల్లో మునిగివుంది. ఇంతలో బిందువాసిని వచ్చి పిలచి "అమూల్యుడు నమస్కారం చేయటానికి వచ్చాడు, ఒకసారి బైటికిరా అక్కయ్యా" అన్నది.

అన్నపూర్ణ బైటికివచ్చి అమూల్యుని వేషం చూచి విస్తుపోయింది. కళ్ళకు కాటుక, బుగ్గమీద బొట్టు, మెడలో బంగారు గొలుసు, తలమీద కేశకిరీటం, పసుపుపచ్చని అద్ద

కఫు) ధోవతి. చేతిలో త్రాడుతో వ్రేలాడదీసిన మట్టిసిరాబుడ్డీ చంకలో చుట్టబెట్టిన తాటాకులు.

"అక్కగారి పాదాలకు నమస్కరించు నాయనా!" అన్నది బిందువాసిని.

అమూల్యుడు తల్లికి నమస్కారం చేశాడు. అతని కాళ్ళకు మేజోళ్లులేవు, బూట్లులేవు, లాగు, చొక్కాలు-మొదలైన విదేశదుస్తులు అసలే లేవు. ఈ అపూర్వ వేషభూషణాలు చూచి అన్నపూర్ణ నవ్వుమొహంతో "నీ తలలో ఎన్ని ఊహలున్నాయే చెల్లీ! అబ్బాయి బళ్లోకి వెళుతున్నాడా ఏమిటి?" అని అడిగింది.

బిందు నవ్వుమొహంతో "అవును గంగయ్యపంతులు గారి పాఠశాలకు పంపుతున్నాను. అబ్బాయి జీవితం సార్థకమయ్యేట్టు ఇవ్వాళ ఆశీర్వదించు అక్కా" అని, "ఒరే భైరవా! అబ్బాయినెవరైనా కొడతారేమో, జాగ్రత్తగా చూస్తూండమని నేను చెప్పానని చెప్పు" అని నౌకరు కాజ్ఞాపించి, "అక్కా ఈ అయిదురూపాయలు పెట్టి కొబ్బరీ, బెల్లమూ తెప్పించి దాసీదానిచేత బళ్ళోకి పంపు" అంటూ ప్రగాఢ ప్రేమతో బిడ్డను ఎత్తుకు ముద్దెట్టుకుని చంకనేసుకు వెళ్ళిపోయింది.

అన్నపూర్ణ రెండు కళ్ళల్లో నీరు నిండుకొచ్చాయి. ఆమె వంటలక్క నుద్దేశించి "కన్నబిడ్డ కాకపోయినా బిందుకు కుర్రవాడిమీదే పంచప్రాణాలు, కడుపున పుట్టిన బిడ్డయితే ఇంకా ఏమి చేసేదో!" అన్నది.

"అందుకనే కాబోలు పద్దెనిమిది, పాధోసిమిది ఏళ్ళు వచ్చినా భగవంతుడు ఆమె కడుపు పండించలేదు" అని వంట లక్కి అంటూవుండగా, బిందువాసిని బిడ్డనువదిలి తిరిగివచ్చి "అయితే బావగారితో చెప్పి మన ఇంటిముందే ఒకస్కూలు పెట్టించరాదూ అక్కా! ఆ ఖర్చంతా నేనే పెట్టుకుంటాను" అన్నది.

అన్నపూర్ణ నవ్వి, "వాడింకా రెండడుగులు వేశాడో లేదో అప్పుడే నీ ఉద్దేశం మారిందా! అయితే నువ్వయినా వెళ్ళరాదు వాడితోపాటు బళ్ళో కూర్చుందువుగాని" అన్నది.

బిందు సిగ్గుపడినట్లయి నవ్వి, "ఉద్దేశం మారటం కాదక్కా: అబ్బాయి చాటున వుండటం వేరు, కళ్ళఎదుట ఉండటం వేరు. పిల్లకాయలంతా ఒట్టి అల్లరివాళ్లు. చిన్నవాణ్ణి గాచూచి కొడితే?" అన్నది.

"కొడితేయేం? పిల్లలు కొట్టుకోరూ! అదీగాక అందరి పిల్లలూ ఒకటే. ఎవరిపిల్లలు వాళ్ళకెక్కువ. గుండె రాయి చేసుకొని అందరూ పంపగాలేనిది నీవు పంపటానికేం?" అన్నది అన్నపూర్ణ.

ఇతరులతో పోలికలు చూపెట్టటం బిందువాసినికి సుతరాం ఇష్టముండదు. అందుకనే లోలోన అసంతృప్తిపడి "మీ మాటలే అలా ఉంటాయి అక్కా! ఒకవేళ ఎవరైనా కలంపెట్టి వాడికంట్లో పొడుస్తాడనుకో, అప్పుడేం కావాలి?" అన్నది.

అన్నపూర్ణ బిందువాసిని మనసులోని భావాన్ని గ్రహించి నవ్వింది. "అలాగయితే డాక్టరును చూపెడుదువు

గానిత్తే, నీకో సంగతి చెబుతున్నాను. ఏడు రాత్రులు, ఏడు పగళ్ళు కూచుని ఆలోచించినా కలంపెట్టి యీ కళ్ళల్లో పొడవటం విషయం నా మనసులోకే రాలేదు. ఇంతమంది పిల్లలు బడికి పోతున్నారు. ఎవరూ ఎవళ్ళనీ కలంపెట్టి కంట్లో పొడిచినట్టు వినలేదు" అని అన్నది.

"మీరు వినలేదు కాబట్టి అలాంటి పనులు జరగవనా? మనకు తెలియని పనులు ఎన్ని జరగటంలేదు! సరే, నువ్వు బావగారితో ఒక్కసారి చెప్పిచూడు. ఆ తర్వాత జరిగేదేదో జరుగుతుంది" అన్నది బిందు.

అన్నపూర్ణ గంభీరంగా "జరిగేదేదో కళ్ళకు కట్టినట్టు కనపడుతూనే ఉందిగా. నువ్వు తలచుకుంటే పూర్తిగాని పనంటూ ఉంటుందా? ఇలాంటి లోకవిరుద్ధమైన కోరికలు నేను కోరనమ్మా! నువ్వు వారితో మాట్లాడతావుగా. స్వయంగా వెళ్ళి చెప్పరాదూ?" అన్నది.

ఈ సారి బిందుకు కోపంవచ్చింది. "సరే, నేనే చెబుతాను. తప్పకుండా చెబుతాను. దీనివల్ల ఎవరికి కష్టం కలిగినా వాడికి చదువు వచ్చినా రాకపోయినా, రోజూ నా బిడ్డను అంతదూరం నడిపించి పంపలేనమ్మా! ఏమే కదంబా, నోరు తెరచుకుని అలా చూస్తావేమిటే—కొబ్బరీ, బెల్లం బళ్ళోకి పట్టుకెళ్ళమని నీతో చెప్పలేదూ?" అన్నది.

బిందుకు కోపంవచ్చినట్టు గ్రహించి అన్నపూర్ణ "కొబ్బరీ, బెల్లమూ నేను కోరియిస్తాను. నువ్వు గడబడ పడకమ్మా. నీ బిడ్డ ఎప్పుడూ పెరిగి పెద్దవాడు కాడూ

ఎప్పుడూ తట్టకింద కమ్మేసి వుంచగలవా? ఈ సంగతి ఆలోచించుకోవేం?" అన్నది తొందరపాటుతో.

బిందు దీనికేమీ సమాధానం చెప్పక, "కదంబీ, అబ్బాయిని ఎత్తుకు వెళ్ళి పంతులుగారికి దణ్ణం పెట్టించి వెంటనే తీసుకురా! పంతులుగారిని సాయంకాలం నేను ఒకసారి రమ్మన్నానని చెప్పు-చెప్పినా తెలుసుకోనివారికి చెప్పేదెలా! చిన్నవాణ్ణి చేసి ఎవరైనా కొడతారేమోనని నేనంటే-ఎప్పుడూ తట్టకింద పెట్టికప్పి ఉంచగలవా అంటుంది ఆమె. ఏమి చేయగలనో ఏమి చేయలేనో ఆ సలహా ఏమీ తీసుకోటానికి నేనిక్కడికి రాలేదు" అని సమాధానానికి ఎదురుచూడకుండానే గబగబా వెళ్ళిపోయింది.

అన్నపూర్ణకు నోటమాట రాలేదు. చూస్తూ నిలబడి పోయింది.

"ఇంక నిలబడకమ్మా! ఆమెగారు మళ్ళా యిప్పుడే వచ్చినా వచ్చేయగలరు! ఆమె మనసులో అనుకుందంటే బ్రహ్మ వచ్చినా మార్పులేదు" అన్నది కదంబ.

ఆనాటి రాత్రి ప్రొద్దుపోయిన తరువాత యాదవుడు పక్కమీద వెల్లకిలా పండుకొని నల్లమందు వేసుకుని హుక్కా గొట్టం నోట్లో పెట్టుకొని నిషామీద స్వారిచేస్తున్న సమయంలో తలుపు గొళ్ళెంచప్పుడు వినపడింది. యాదవుడు అతి కష్టంమీద కళ్లు తెరిచి "ఎవరది?" అన్నాడు.

అన్నపూర్ణ లోపలికి వెళ్ళి "మరదలు ఏదో చెప్పుకోటానికి వచ్చింది. వినండి" అన్నది.

యాదవుడు ఆశ్చర్యంతో—"మరదలా! ఏమిటమ్మా!" అన్నాడు.

అతడికి మరదలంటే చాలా వాత్సల్యం. మరదలు మాట్లాడలేదు. ఆమె తరఫున అన్నపూర్ణే అన్నది "ఈమె బిడ్డకట్లో బడిపిల్లలు కలంపెట్టి పొడుస్తారట, అందుకని మన ఇంట్లోనే బడి పెట్టించమంటున్నది."

యాదవుడు చేతిలో హుక్కా-గొట్టం అవతలపారేసి ఆతురతతో "కంట్లో కలంపెట్టి పొడిచిందెవరూ? ఏడి చూస్తాను" అన్నాడు.

అన్నపూర్ణ గొట్టం అతనిచేతి కందించి, "ఇప్పటికింకా ఎవరూ పొడవలేదు. పొడిస్తే గిడిస్తేనన్న మాట" అన్నది.

యాదవుడు స్థిమితపడి అన్నాడు. "ఆ పొడిస్తే గిడిస్తే నన్నమాట. నే ననుకున్నాను..."

చాటునున్న బిందు మండిపోతూ వుంది. మృదు స్వరంతో "అలాంటి లోకవిరుద్ధమైన మాటలు నోటితో చెప్ప లేనన్నావు, ఇప్పుడెందుకు చెప్పవచ్చావు?" అన్నది.

తను చెప్పేరీతి బాగుండలేదనీ, దాని ఫలితం మధు రంగా వుండదనీ అన్నపూర్ణ గ్రహించింది. ఇప్పుడీ లోడికోడలి భీతిస్వగపు గూఢార్థం స్పష్టంగా హృదయంగమము చేసుకొని ఆమె భయపడిపోయింది. ఆమె కోపం ఏమీ తెలియని భర్త మీదకు తిరిగింది. అతన్ని ఉద్దేశించి, "నల్లమందు మత్తుతో మనిషి కళ్లు మూసుకుపోతాయిగాని, చెవులుకూడా మూసుకు పోతాయా ఏమిటి? నేను అనేదేమిటి. మీరు చెప్పిందేమిటి!

బిడ్డకంట్లో పొడిచిందెవరు చూస్తాను అనా? నాకు అన్ని విధాలా అగచాట్లే" అన్నది.

పాపమా యాదవుని నల్లమందు మత్తు వదిలిపోయింది. అతను వెలవెలపోయి, "ఏమిటి? జరిగిందేమిటి?" అన్నాడు.

అన్నపూర్ణ కోపంతో, "జరిగిందేమిటో బాగానే జరిగింది. ఇటువంటి మనుష్యులతో మాట్లాడటం నాదే తప్పు. నా ఖర్మ!" అంటూ గదిలోంచి బైటికి వెళ్ళిపోయింది.

"ఏమి జరిగిందేమిటమ్మా! కొంచెం విప్పిచెప్పు!" అని యాదవు డడిగాడు.

బిందు తలుపుచాటున నిలబడి, "బైట అరుగుమీద బడి పెట్టిస్తే" అన్నది మెల్లగా.

"అదేమంత పెద్దపనమ్మా! అయితే దానిలో చదువు చెప్పే దెవరు?"

"పంతులుగారు ఇక్కడే ఉన్నారు. నెలకు పదిరూపాయలు ముట్టచెప్పితే ఇక్కడే పెడదామంటున్నారు. నా కట్నం డబ్బుమీద వచ్చే వడ్డీలోంచి కొంతతీసి యిద్దామని..."

యాదవుడు తృప్తిపడి "సరే, రేపే ఏర్పాటు చేయిస్తా గంగరామయ్య పంతులు బడి ఇక్కడికి మారిస్తేనే బాగుంటుంది" అన్నాడు.

బావగారు వప్పుకున్నతర్వాత బిందు కోపమంతా ఎగిరిపోయింది. నవ్వు మొహంతో వంటింట్లోకి వెళ్ళి చూచింది. అన్నపూర్ణ మొహం ముడుచుకుని కూర్చొనివుంది. ఆమె నెంత కదంబి నిల్చుని చేతులు తిప్పుతూ ఏదో వ్యాఖ్యానం చేస్తూ వుంది. బిందు ఇంట్లోకి రావటంతోనే "చిన్నమ్మగారు!" అని

వ్యాఖ్యానం ముగించింది. తనచర్చే జరుగుతూవుందని గ్రహించింది బిందు. కొంచెం దగ్గరగావచ్చి "చిన్నమ్మగా రేమిటీ!" అన్నది.

భయంతో కదంబిని గొంతు బిగుసుకుపోయింది. "ఏమీ లేదు అమ్మా, పెద్దమ్మగారు అనలా...అదే..." అని గుటక మింగింది.

"అవును. నీ సంగతి నాకు తెలుసులే. సరే, వెళ్ళి నీ పని నీవు చూసుకో" అన్నది బిందు కఠినంగా.

కదంబి మళ్ళీ నోరెత్తకుండా అక్కడనుంచి వెళ్ళిపోయింది ప్రాణాలు బిగపట్టుకొని.

తరువాత బిందు అన్నపూర్ణతో "పెద్ద యజమానురాలికి దొరికే సలహాదార్లుకూడా చాల పెద్దలే. బావగారితో చెప్పి వీరికి జీతాలు ఎక్కువ చేయిస్తే బాగుంటుంది" అన్నది. బిందు 'సంతోషంగా ఉంటే అన్నపూర్ణను అక్కా అనీ, కోపంగా ఉంటే యజమానురాలు' అనీ అంటుంది.

అన్నపూర్ణ మండిపడి "అలాగే, పోయి చెప్పరాదు, బావగారు నా తల తీయిస్తారు. ఆయనగారు మాత్రం తక్కువేమిటి? అంటున్నావు? బాగానే ఉంది అని తాళం వేస్తారు. నేనూ చాలమంది అదృష్టవంతులను చూశానుగాని వారెవరూ నీతో సరిపోలరమ్మా! నువ్వు ఏ అదృష్టంతో పుట్టావో గాని, ఇంటిల్లపాదికీ నువ్వంటె హడల్!" అన్నది.

బిందుకు కోపం వచ్చింది కాని, అన్నపూర్ణ అన్న మాటల ధోరణిచూసి ఆమెకు నవ్వువచ్చింది. "నువ్వేమీ భయపడటం లేదుగా!" అన్నది.

"ఇంకా భయపడక పోవటమా! నీ చండికా స్వరూపం చూసి ఎవరిగుండె నీరు కాదు! అంతటి గుండెగల బిడ్డను కన్న తల్లి ఉందా? ఇంతకోపం మంచిదికాదు చెల్లీ! నువ్వింకా పసి దాని వేమీ కాదు. పిల్లలు కనడం మొదలెడితే ఈ పాటికి నలుగురైదుగురు పిల్లలతల్లి వయ్యేదానివి. అయినా నిన్నని ఏమిలాభం! ఆ ముసలాయన గారాన పెట్టి పాడుచేశాడు" అన్నది అన్నపూర్ణ.

"నిజంగా అదృష్టంతోనే పుట్టాను అక్కా! డబ్బూ-దస్కమూ, గారామూ చాలామందికి దొరుకుతాయి; అదేం గొప్పవిషయం కాదు. దేముడులాంటి ఈ బావగారు దొరక టానికి నిజంగా జన్మజన్మాల తపస్సుచేసి పుట్టాలి. నా అదృ ష్టానికి నువ్వు ద్వేషించేమి లాభం అక్కా! గారాబంచేసి పాడుచేసినవారు వారుకాదు, తమరు" అన్నది బిందువాసిని.

అన్నపూర్ణ చేతులు తిప్పుతూ "నేనా, ఎవరైనా అంటే మంచిదే, నా శాసనం బలీయమైనదని, నాకంత అదృష్టం పట్టలేదు. నా వ్యక్తిత్వం ఎవరికీ పనికిరాదు. నామాట ఎవరూ వినరు. ఇంటి నౌకర్లు కూడా నా ఎదట నిలబడి యజమానులు లాగ మాట్లాడతారు. నేను కాబట్టి ఇవన్నీ సహించగలుగు తున్నాను. మరొకరైతేనా?" అన్నది.

అన్నపూర్ణ అన్న ఈ మాటలకు బిందువాసిని కిలకిలా నవ్వి "నువ్వు సత్యకాలపు మనిషివి అక్కా! ఈ కాలంలో పుట్టవలసినదానవు కాదు" అని రెండు చేతులతో అన్నపూర్ణ మెడను పెనవేసుకుని "ఏదైనా కథ చెప్పవు అక్కయ్యా!" అన్నది.

అన్నపూర్ణ కోపగించుకుని, "ఇక చాల్లే, నన్ను వదిలి పెట్టు" అన్నది.

ఇంతలో కదంబం పరుగెత్తుకు వచ్చి "అమ్మగారూ! అబ్బాయి అడకత్తెరతో వేలు కోసుకుని ఏడుస్తున్నాడు" అని చెప్పింది.

బిందువాసిని అన్నపూర్ణమీద వేసిన చేతులు తీసేసి నిలబడి "అడకత్తెర వాడి చేతిలోకెలా వచ్చిందే? నువ్వేం చేస్తున్నావు?" అన్నది.

"నేను ఆ గదిలో పక్క వేస్తున్నాను, పెద్దమ్మగారి గదిలోకి వెళ్లాడు కామాసు, నాకు తెలియనుకూడా తెలియదు" అన్నది కదంబం.

"సరే తెలిసింది విన్నాను. ముందు పో నువ్వు ఇక్కడి నుంచి" అంటూ బిందు అక్కడినుంచి వెళ్ళి అమూల్యుని వేలికి తడిగుడ్డ చుట్టి అతణ్ని చంకనేసుకుని మళ్లా అక్కడకు వచ్చి "నీకు ఎన్నిసార్లు చెప్పాను అక్కా! పిల్లా జెల్లా వున్న యిల్లు. కత్తులూ కటార్లూ వాళ్ళకు అందకుండా పెట్టమని" అన్నది.

అన్నపూర్ణకు మరింత కోపం వచ్చింది. "నువ్వేలాంటి మాటలు మాట్లాడతావే బిందూ! నీ బిడ్డ వేలు కోసుకుంటాడని అడకత్తెర ఇనపపెట్టెలో పెట్టి తాళం వేస్తావేమో?" అన్నది.

"అలా అయితే రేపటినుంచి వాణ్ణి త్రాడుతో కట్టేసి వుంచుతాను. నీ గదిలో అడుగుపెట్టే పనివుండదు" అంటూ బిందు బైటకు వెళ్ళిపోయింది.

"విన్నావా కదంబం. ఈవిడగారి విచిత్రపు మాటలు అడకత్తెర ఎక్కడైనా పెట్టెలోపెట్టి తాళంవేసి వుంచుతారంటే?" అన్నది అన్నపూర్ణ. కదంబా ఏదో అనబోతూ వుండేప్పటికి బిందు మళ్ళా వచ్చి "మీరీ కబుర్లన్నీ నౌకరు - చాకర్లకు చెప్తూతూ కూర్చున్నారంటే నేనిదే చెబుతున్నాను బిడ్డను తీసుకొని మా పుట్టింటికి వెళ్ళిపోతాను" అన్నది.

"వెళ్ళిపోతే పోరాదు. తల బద్దలుకొట్టుకున్నా నిన్ను మళ్ళా రమ్మంటే వట్టు" అన్నది అన్నపూర్ణ.

"అసలు నేనుండటమే ఇష్టంలేదన్నమాట" అంటూ బిందు గంపెడు మొహంచేసుకు వెళ్ళిపోయింది.

రెండుగంటలతరవాత అన్నపూర్ణ గబగబ అడుగులు వేసుకుంటూ కోడికోడలు గదిలోకి వెళ్ళింది. మాధవుడొక మూల ఏవో కోర్టుకాగితాలు చూచుకుంటూ కూర్చున్నాడు. బిందు అమూల్యుని పక్కలో వేసుకు పండుకొని కథ చెబుతూ వుంది.

"అన్నం తిందువుగాని రా" అన్నది అన్నపూర్ణ.

"నాకు ఆకలిలేదు" అన్నది.

అమూల్యుడు పింతల్లిని అతుక్కుపోయి "మా అమ్మ అన్నం తినదు, నువ్వు పో" అన్నాడు.

అన్నపూర్ణ "నువు నోరుముయ్యి" అని కొడుకును కసిరి "వీడే కారణం ఈ తగూలన్నింటికీని. బాగా గారాన బెట్టి నెత్తిన ఎక్కించుకున్నావు. తర్వాత తెలుస్తుంది. అక్క అన్నట్టే అయిందని అప్పుడనకపోతావ్" అన్నది.

బిందువాసిని అమూల్యుని చెవిలో ఏదో గుసగుసలాడ గానే అతను "నువ్వు వెళ్ళవే అక్కా, అమ్మనాకు కథచెబు తూఉంది" అన్నాడు.

"మేఘకోరే దాసవైతే లేవిరా తల్లీ! రాకపోతే మిమ్మల్నిద్దరిని కేప్పొద్దునే పంపకపోతే నన్ను పేరున పిలవద్దు" అని అలాగే గబగబ అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయింది అన్నపూర్ణ.

"ఇవ్వాళ మళ్లా యేంవచ్చింది?" మాధవు డడిగాడు.

"అక్కగారికి కోపంవస్తే ఏమిఅవుతుందో, అదే వచ్చింది. ఇది పిల్లాజెల్లా తిరిగేకొంప. అడకతెరలవీ కొంచెం జాగ్రత్తగా పెట్టమన్నాను, దాని కింత కాండ జరుగుతూ వుంది" అన్నది. బిందువాసిని.

"ఇక మాట్లాడకు వెళ్ళు. ఆమె ఎలా వెళుతుందో చూశావా? అన్నయ్య లేస్తాగు" అన్నాడు మాధవుడు.

బిందువాసిని అమూల్యుని చంకవేసుకుని నవ్వుతూ వంటింటివైపుకు వెళ్ళింది.

## 3

ఇద్దగు బిడ్డలొక తల్లి నాశ్రయించుకు పెరిగినట్లు—ఈ ఇద్దరు తల్లులు ఈ బిడ్డ నాశ్రయించుకుని ఆరేళ్లు గడిపారు. అమూల్యుడు ఇప్పుడు కొంచెం పెద్దవాడయ్యాడు. ఎంట్రెన్సు స్కూల్లో రెండవతరగతి చదువుచున్నాడు. ఇంటివద్ద చెప్పటానికి ప్రయివేటు మాష్టర్నికూడా కుదిర్చారు. ఆయన ప్రొద్దున్నే

ప్రయివేటు చెప్పివెళ్ళాక అమూల్యుడు బైట ఆడుకోటానికి బైలుదేరాడు. ఇవ్వాళ ఆదివారం స్కూలు లేదు.

అన్నపూర్ణ బిందువాసిని గదిలోకివచ్చి, "ఏమి చెయ్యాలో చెప్పు చిన్నమ్మా!" అన్నది.

బిందువాసిని అలమారలో బట్టలన్నీ కిందగుట్టవేసి, ఆ గుట్టలోంచి అమూల్యుడికి దుస్తు తీరుతూ ఉంది. ఇవ్వాళ అతడు పినతండ్రి వెంట ఎవరో మహాధనికుని ఇంటికి విందుకు వెళతాడు. బిందు తలెత్తి చూడకుండా "ఏం చెప్పనుఅక్కా!" అని సమాధాన మిచ్చింది.

బిందువాసిని సంతోషంగా ఉన్నట్లులేదు. కింద పడి ఉన్న రకరకాల దుస్తులగుట్టను చూసి స్తంభించిపోయినందు వల్ల తోడికోడలి స్వభావం గ్రహించలేకపోయింది. "ఇవన్నీ అమూల్యుడివేనా?" అన్నది.

"అవును."

"ఎంతడబ్బు వృథాగా ఖర్చు పెడుతున్నావమ్మా! దీనిలో ఒక్కొక్కదాని వెల పెడితే ఒక్కొక్క పేదపిల్లాడికి సంవత్సరం పొడుగునా గుడ్డలకు సరిపోతుంది.

బిందువాసిని అసంతృప్తి పడింది. అయినా స్వాభావికంగానే "అయితే కావచ్చు! కాని భాగ్యవంతుల్లో భాగ్యహీనుల్లో చాలా తేడా ఉంటుంది. అందుకోసం మనం దుఃఖిస్తే ఏమిలాభం?" అన్నది.

"మహా భాగ్యవంతుడైనాడులే! నీవు చేసే ప్రతి పని లోనూ అది కనిపిస్తూనే ఉంటుంది" అన్నది అన్నపూర్ణ.

బిందు తలెత్తి "ఏమి చెప్పటానికి వచ్చావో, అది చెప్పి వెళ్ళరాదు అక్కా! నా కిప్పుడు తీరికలేదు, నీ మాటలన్నీ వినటానికి" అన్నది.

"నీకు తీరికెప్పుడు ఉంటుంది ?" అని కోపంతో వెళ్ళిపోయింది అన్నపూర్ణ.

అమూల్యుణ్ణి పిలుచుకురావటానికి భైరవుడు బైటకు వెళ్ళి గంటా గంటన్నర తర్వాత వెతుక్కు తీసుకువచ్చాడు.

"ఇంతసేపటినుంచి ఎక్కడున్నావు ?" అని అడిగింది బిందు.

అమూల్యుడు మాట్లాడలేదు.

"ఆ వీధి కాపుపిల్లలతో కలిసి బిళ్ళంగోడు ఆడుతున్నాడు" అని చెప్పాడు భైరవుడు.

ఆ ఆటంటే బిందుకు తగని భయం. అందుకని ఆ ఆటకు వెళ్ళొద్దని నివారిస్తుంది.

"బిళ్ళంగోడు ఆడవద్దని నీతో చెప్పలా ?" అన్నది బిందు.

అమూల్యుడు భయంతో "నే నక్కడ నుంచునివుంటే, వాళ్ళే బలవంతాన నన్ను..." అని ఆగిపోయాడు.

"బలవంతాన !...సరే, ముందు భోజనానికి వెళ్లు వచ్చాక చెబుతాను" అని అతనికి కుస్తులు వేసింది.

రెండు నెల్లక్రితం అమూల్యుడికి వడుగయింది. బోడి నెత్తిన టోపీ పెట్టుకోటానికి మహా మారాం చేశాడు. కాని

బిందు వదిలి పెట్టే మనిషా? బలవంతంగా జరీటోపీ పెట్టింది. దీనికి అమూల్యుడు ఏడవటం మొదలెట్టాడు. మాధవుడు గదిలోకివస్తూ "ఇంకెంత ఆలస్యం?" అని అమూల్యుని చూడ గానే "అరే, మధురాపురగపు శ్రీకృష్ణులు వారైపోయారు!" అన్నాడు. అమూల్యుడు సిగ్గుపడి టోపీతీసి అవతల పారేసి మంచంమీదకెళ్ళి బోర్లపడ్డాడు. బిందు కోపగించుకొని "పిల్ల వాడు అసలే ఏడుస్తుంటే—ఇంకా మీరు..." అన్నది.

మాధవుడు గంభీరంగా "ఏడవక లేబాబూ? లోకులు పిచ్చివాడంటే నన్నంటారు, నువ్వు లేదిరా!" అన్నాడు.

ఇంతకుముందొకనాడు సరిగ్గా ఇలాంటి విషయమే వచ్చింది. అప్పుడు బిందుకు చాలా కోపం వచ్చింది. మళ్లా ఇప్పుడు అలాంటి విషయమే జరగటంవల్ల మండిపడి "నేను చేసేపనులన్నీ పిచ్చిపనులే" అంటూ అమూల్యుని లేవదీసి విసనకర్రతో రెండేసి అతనికి తొడిగిన ముఖమల్ దుస్తులు విప్పదీసి పారెయ్య సాగింది.

మాధవుడు భయంతో బైటికివచ్చి "దానికి దయ్యం పట్టినట్టుంది—ఒకసారి వెళ్ళి చూదిరా వదినా!" అన్నాడు వదినతో.

అన్నపూర్ణ గదిలోకెళ్లి చూసింది. బిందు మొదట తొడిగిన బట్టలు తీసేసి మామూలు దుస్తులు వేస్తూవుంది. కుర్రవాడు భయంతో నిలబడి వుండిపోయాడు.

"ముఖమల్ దుస్తులు విప్పేశావేమమ్మా!" అన్నది అన్నపూర్ణ.

బిందువాసిని అమూల్యాని వదిలేసి వచ్చి అన్నపూర్ణ పాదాలవద్ద మోకరించి, చేతులుజోడించి "మీ పాదాలమీద పడతాను, నువ్విక్కడనుంచి వెళ్లిపో అక్కా! మీ అందరి మూలంగా వాడి ప్రాణాలు కడబడుతున్నాయి" అన్నది.

అన్నపూర్ణ మాట్లాడలేక అలాగే నిలబడిపోయింది.

బిందు అమూల్యాని చెవిపట్టుకుని ఒక మూలకు తీసుకొచ్చి నిలబెట్టి "నువ్వు దుష్టుడివి. తగిన శిక్ష అనుభవించు. ఇవ్వాళల్లా ఇక్కడే ఉండు. అక్కా, నువ్వివతలికి రా. తలుపు వేస్తాను" అన్నపూర్ణతో అని, తలుపుబైట గొళ్ళెం పెట్టింది.

షుమారు ఒంటిగంట కావచ్చింది. అన్నపూర్ణ నిలవలేక "నిజంగా నువ్వు ఇవ్వాళ వాణ్ణి అన్నం తిననియ్యవా బిందూ? వాడిమూలంగా ఇంటిల్లపాదీ పస్తుండాలిసి వస్తుంది" అన్నది.

"వాళ్ళ యిష్టం" అన్నది బిందు.

"అదెలాంటిమాట చెల్లీ? ఇంట్లో ఒక్కగా నొక్క బిడ్డ! వాడు తినకుండావుంటే నీ మాట, నా మాట అలా ఉంచు. నౌకర్లు ఎలా తింటారో చెప్పు!" అన్నది అన్నపూర్ణ.

"నాకదంతా ఏమీ తెలియదు" అన్నది బిందు పంతంగా.

ఇహ తర్కిస్తే లాభంలేదనుకున్నది అన్నపూర్ణ "నేను చెబుతున్నాను విను. అకట్మాట తీసెయ్యకు. ఇవ్వాల్టికి వాణ్ణి క్షమించు. వాడకి జబ్బుచేస్తే నువ్వే అనుభవించాల్సి వస్తుంది" అన్నది.

ప్రొద్దెక్కటంకాసి బిందు స్వయంగానే మెత్తబడింది. కదంబినిని పిలిచి "పోయి వాణ్ణిలా తీసుకురా. అక్కా, నీకిదే చెబుతున్నాను: ఇహ నా విషయంలో మీరు కలగజేసుకున్నారంటే బాగుండదు" అన్నది.

ఆనాటి గందరగోళం అంతటితో ఆగిపోయింది.

తమ్ముణ్ణి ప్రాక్టీసు పెట్టినతరువాత యాదవుడు ఉద్యోగం వదిలేసి, స్వంత ఆస్తిపాస్తులు చూసుకోవటం ఆరంభించాడు. మరదలు, తీసుకొచ్చిన పదివేల రూపాయలు వడ్డీకి ఇచ్చి రెట్టింపు చేశాడు. ఆ డబ్బులో కొంతా, మాధవుని అర్జనలో కొంతా పెట్టి ఈ ఇంటికొక అరకోసు దూరంలో ఒక పెద్ద భవంతి కట్టించాడు. భవంతి తయారై పదిరోజులైంది. దుర్గాపూజ అయిన తరువాత మంచిరోజు చూసుకొని అందులో ప్రవేశించాలని యాదవుని సంకల్పం. అందుకని ఒకనాడు యాదవుడు భోజనంచేస్తూ మరదలి నుద్దేశించి "నీ భవంతి తయారైందమ్మా! ఒకసారి వెళ్లి చూచుకురా. ఇంకేమైనా చేయవలసి ఉన్నదేమో!" అన్నాడు.

పదిపనులున్నా సరే, వదిలిపెట్టి బావ భోజనం చేస్తున్నప్పుడు తలుపుచాటున కూర్చోవటం బిందువాసినికి అలవాటు. ఆమెకు దేవునిమీద ఎంత భక్తో, బావమీదకూడా అంతే భక్తి. ఆమెకేకాదు, ఇంటిల్లిపాదికీ ఆయనంటే అంత భక్తి ఉంది. తలుపుచాటున కూర్చునివున్న బిందు "ఇంకా చేయవలసిందేమీ లేదు" అన్నది.

యాదవుడు నవ్వి "చూడకుండానే నిర్ణయమా అమ్మా? సరే, మరొక సంగతి. బంధుమిత్రులందరినీ పిలిచి వ

శుభముహూర్తం చూసుకొని గృహప్రవేశ మవ్వాలని ఉంది. ఏమంటావు?" అన్నాడు.

"అక్కతో చెపుతాను, ఆమె ఇష్టం."

"చెప్పు. కాని మా యింటికి నీవు లక్ష్మివి. నీ ఇష్టాను సారమే పనులన్నీ జరుగుతాయి."

అన్నపూర్ణ దగ్గరే కూర్చునివుంది. నవ్వి "మీ లక్ష్మి శాంతం వహిస్తేనే..." అన్నది.

"శాంతమేమున్నది! మా అమ్మ సాక్షాత్ జగద్ధాత్రి. దయతలిస్తే వరమూ యిస్తుంది. అవసరమైతే కత్తీ ఎత్తుతుంది. అదే నాకూ కావలసింది. మా అమ్మ వచ్చినతర్వాత ఇంట్లో కష్టాలంటూ లేకుండాపోయినై" అన్నాడు యాదవుడు.

"మీ రన్నమాట నిజమే. ఆవిడ రాకముందు మన రోజులెలా గడిచినాయో తలుచుకుంటే భయం వేస్తుంది" అన్నది అన్నపూర్ణ.

బిందు సిగ్గుపడి ఆ ప్రసంగాన్ని అంతటితో తెంచి, "మీరు అందరినీ పిలవండి. ఇల్లు చాల పెద్దది. ఉండటానికి ఏ ఇబ్బందీ ఉండదు. వారికి ఇష్టమైతే అయిదారు మాసాలైనా ఉండవచ్చు" అన్నది.

"అలాగేనమ్మా! రేపే అందరినీ పిలవనంపుతాను" అన్నాడు యాదవుడు.

# ౪

వీరికి దగ్గరచుట్టం 'ఏలోకేసి' స్థితి ఏమంత బాగుండలేదు. యాదవుడు తరుచు వారికి ఆర్థికసహాయం చేస్తూవుంటాడు. ఆమె కొడుకు నరేంద్రుడికి ఇక్కడేవుంచి చదువు చెప్పిస్తాను రమ్మనమని కొంతకాలంనుండి ఉత్తరాలు రాస్తున్నాడు కూడా. ఒకనాడు ఏలోకేసి కొడుకుని వెంటబెట్టుకుని ఉత్తరగ్రామంనుండి వచ్చింది. ఆమెభర్త ప్రియనాథుడు అక్కడ ఏమిపని చేస్తూఉంటాడో ఏమో ఎవరికీ తెలియదు. రెండు మూణ్ణాళ్ళల్లో ఆయనకూడా దిగాడు. నరేంద్రుడికి పదహారు పదిహేడేళ్ళు ఉంటాయి. వెడల్పంచుల ధోవతులు కడుతూంటాడు. రోజుకు పది పన్నెండు సార్లయినా తల దువ్వుతాడు. అతని పాపిడినిజంగా చూచితీరవలసిందే.

సాయంత్రం అంతా వంటింటి వసారాలో చేరారు. ఏలోకేసి తన కొడుకు అసాధారణ రూపాన్ని, గుణాన్నీ గురించి చెబుతూవుంది.

"నువ్వేక్లాసు చదువుతున్నావురా నరేంద్ర్ ?" అడిగింది బిందు.

"ఫోర్తుక్లాసు, రాయల్ రీడరు, గ్రామరు, జాగ్రఫీ, ఎరిత్ మెట్రిక్, డిస్మల్–గిస్మల్ ఇంకా ఇలాంటివెన్నో ఉన్నాయి. అవన్నీ నీకేం తెలుస్తుంది అత్తా !" అన్నాడు నరేంద్ర్.

ఏలోకేసి కొడుకు మొహం ఒకసారి గర్వంగా చూచి బిందువాసినితో "ఒక పుస్తకమా ఒక గొడవా నటమ్మా ! బండెడు పుస్తకాలు" అని మళ్లా కొడుకుకేసి చూసి "రేపు

అవన్నీ పెట్టెలోంచి తీసి మీ అత్తయ్యకొకసారి చూపు" అన్నది.

నరేంద్రుడు తలకాయ తిప్పి "ఓ, అలాగే చూపుతా. అన్నాడు.

"చాల ఆలస్యంగా పాసయినట్లు ఉన్నాడు" అన్నది బిందు.

"ఆలస్య మయ్యేదేనటమ్మా! ఈ సాటికి ఒకటికాదు. నాలుగు సాసయ్యేవాడు, ఆ పాడుపంతులొకడు దొరికాడు. వాడిమొహం మండ. వాడికి మా అబ్బాయిమీద కోప మెందుకో వాడికే తెలియాలి. వాడికందుకో ఈ కడుపు మంట. వీణ్ణి పైక్లాసులోకి పోనిస్తేనా! సంవత్సరం పొడుగునా ఒక క్లాసులోనే కూర్చోబెడుతున్నాడు" అన్నది ఏలోకేసి.

బిందు ఆశ్చర్యపడి "లేదే, అలాంటిదెన్నడూ జరగదు" అన్నది.

"జాగదంటావేమిటి? ఒకపక్కని జరుగుతూ వుంటే! పంతుళ్ళంతా ఒక్కళ్ళై లంచాలు మరిగారు. మేము పేదవాళ్ళం వాళ్ళకు లంచం ఎక్కడినుంచి తీసుకురామో చెప్పు?" అన్నది వంగోకేసి.

బిందు విని ఊరుకుంది. కాని అన్నపూర్ణ చాల విచార పడి "ఇలా మనుష్యుల్ని పీడించటం మంచిపని కాదు. మాకీ గొడవలేమీ లేవమ్మా! మా బాబు ప్రతియేడు మంచి మంచి బహుమతులు తెచ్చుకుంటాడు. ఎవరికీ లంచం గించం ఇవ్వ నవసరం లేదు" అన్నది.

ఆ సమయంలో అమూల్యుడు ఎక్కడనుంచో వచ్చి మెల్లిగా బిందువాసిని వడిలో పడ్డాడు, పడేపడటంతోనే ఆమె మెడలో చేయివేసి చెవిలో "రేపు ఆదివారం ఇవ్వాళ్టి పంతులుగారిని వెళ్ళిపొమ్మని చెప్పవు ?" అన్నాడు.

బిందువాసిని నవ్వి "వీణ్ణి చూస్తున్నావా వలోకేస్సీ ! కబుర్లంటే చాలు, కదలడు. ఓసే కదంబం-అబ్బాయి ఇవ్వాళ చదువుకోడుగాని, పంతులుగారిని వెళ్ళిపొమ్మని చెప్పు" అన్నది

నరేంద్రుడు ఆశ్చర్యపడి "ఇదేమిటిరా అమూల్యా. ఇంత పెద్దవాడవయిన తర్వాత కూడా ఆడవాళ్ళ వళ్ళల్లో కూర్చుంటార్రా ?" అన్నాడు.

బిందు నవ్వి "ఇంతవరకే ననుకున్నావా, ఇంకా రాత్రి పూట..." అమూల్యుడు వ్యాకులపడి, చేత్తో ఆమె నోరు మూసి "చెప్పొద్దమ్మా" అన్నాడు. బిందు ఏమీ చెప్పలేదు గాని, అన్నపూర్ణ అందుకుని "ఇప్పటికీ అబ్బాయి రాత్రిళ్ళు పినతల్లి పక్కలోనే పండుకుంటాడు" అన్నది.

"పడుకుంటే నయమే, గబ్బిలంలాగ అతుక్కుపోతాడు" అన్నది బిందు.

అమూల్యుడు సిగ్గుతో మొహం పినతల్లి వక్షంలో దాచుకున్నాడు.

"ఛీ ! ఛీ ! ఎలాంటివాడివిరా! నువ్వు ఇంగ్లీషు చదువుతున్నావా ?" అన్నాడు నరేంద్రుడు.

"ఎందుకు చదవటంలేదు, స్కూలులో చదివేది ఇంగ్లీషేగా ?" అన్నది అన్నపూర్ణ.

"చదువుతున్నాడా! అయితే ఇంజినుకి స్పెల్లింగు చెప్ప మను, వాడి తరంకాదు" అన్నాడు నరేంద్రుడు.

"అది గొట్టుమాట, ఇంకా చిన్నవాడు! ఎలా చెప్ప గలడు?" అన్నది ఏలోకేసి.

"ఏది? చెప్పు నాయనా?" అన్నది అన్నపూర్ణ.

అమూల్యుడు నోరు మెదల్పలేదు.

బిందు అతనితల తన వక్షానికి అదిమిపట్టి "మీరంతా కలిసి వాణ్ణి సిగ్గుపరిచారు. ఎలా చెబుతాడు?" అని తర్వాత ఏలోకేసి కేసి చూసి "ఈ యేడు మా అబ్బాయి పరీక్ష పాస వుతాడు. ఇరవై రూపాయలు బహుమతి వస్తుందని మాష్టరు గారు చెప్పారు. ఆ డబ్బుపెట్టి పినతండ్రిలాగానే ఒక గుర్రం కొంటాడు" అన్నది.

ఈమాట నిజమైనప్పటికీ పరిహాసంకింద తీసుకుని అందరూ నవ్వసాగారు.

"ఇదిగో బిందమ్మగారూ! మా నరేంద్రుడు చదువు సంధ్యల్లో [illegible] డక్కుంటున్నారేమో — నాటకాల్లో వేషాలు వేశాడంటే చూచేవాళ్ళ కళ్ళల్లో నీళ్ళు తిరగాలిసిందే. ఒకసారి సీతామ్మవారి వేషం వేశాడు. మీ అత్తల కోసారి చూపించు నాయనా!" అన్నది ఏలోకేస్సి.

"నరేంద్రుడు వెంటనే మోకరించి, చేతులు జోడించి, ముక్కుతో— "హా ప్రాణేశ్వరా, ఏ దుర్ముహూర్తాన మీ చరణదాసి..." అని మొదలెట్టాడు.

బిందు గాభరాపడి "ఆగాగు, బావగారు పైనున్నారు" అన్నది.

నరేంద్రుడు కంగారుపడి ఆపేశాడు.

విన్న కాస్త దానికే ముగ్ధురాలై అన్నపూర్ణ "వింటే మాత్రమే మేమన్నాం! పురాణగాథ, మంచి మాటలేగా" అన్నది.

బిందు అసంతృప్తిపడి "వింటే మీరు వినండి పురాణగాథలు. మేము వెళ్ళిపోతున్నాం" అన్నది.

"అయితే అది ఆపివేసి సావిత్రి పార్టు చెబుతా!"

"వద్దు" అన్నది బిందు.

ఈ కంఠస్వరం విని వ్యవహారం చాల దూరంవరకు పోయిందనీ, ఇంతటితో ఆగదనీ గ్రహించింది అన్నపూర్ణ. ఏలోకేసి కొత్తగా వచ్చింది. ఇక్కడి ఆంతరంగిక వ్యవహారాలు తెలియవు. "సరే, ఆపెయ్యి నాయనా! మగవాళ్ళింట్లో లేనప్పుడు ఇంకెప్పుడైనా చేద్దువుగాని" అని, మళ్ళా సభాస్థలికేసి తిరిగి, "మా వాడు పాడటంలో, ఆడటంలో తక్కువేమనుకున్నారేమో, దమయంతి దుఃఖిస్తూ పాడినపాట ఎప్పుడైనా వినిపించు నాయనా! ఒకసారి వింటే వీళ్ళు వదిలిపెడతారేమో చూద్దాం!" అన్నది.

"ఇప్పుడే పాడనా!" అన్నాడు నరేంద్రుడు.

కోపంతో బిందువాసిని పళ్ళు మండుకుపోతూ వుంది. అందుచేత ఏమీ మాట్లాడలేదు.

"వద్దువద్దు, ఇప్పుడేమీ పాటపాడవద్దు" గబగబా అనేసింది అన్నపూర్ణ.

"నేనీపాట అమూల్యుడికి నేర్పుతాను. నాకు మద్దెల వాయించటంకూడా వచ్చు. 'తకిటత, తకిటత' వరస వాయించటం చాల కష్టం అత్తా! ఆ రాగిబిందె ఇటివ్వు. వాయించి చూపెడతా" అన్నాడు నరేంద్రుడు.

బిందు అమూల్యుని లెమ్మని సైగచేసి "లే, ఇంట్లో కెళ్ళి చదువుకో బాబు" అన్నది.

మైమరచి వింటున్న అమూల్యునికి లేవాలని లేదు. "ఇంకా కొంచెంసేపు కూర్చుందాం అమ్మా!" అన్నాడు మెల్లిగా.

బిందు ఏమీ మాట్లాడకుండా అమూల్యుని రెక్క పట్టుకు లేవదీసి, వెంటబెట్టుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది.

బిందు తలవని తలంపుగా ఇలా వెళ్ళిపోవటంతో నరేంద్రుని సాంగత్యంవల్ల అమూల్యుడు చెడిపోతాడనీ, అందుకనే నరేంద్రుడు ఇక్కడవుండి చదువుకోటం బిందుకిష్టం లేదనీ అన్నపూర్ణ గ్రహించి, ఉద్విగ్నురాలై "నాయనా నరేంద్ర్! ఇక నుండి మీ చిన్నత్తముందెప్పుడూ ఈ యాక్టులు చెయ్యకు. ఆవిడకు ఇవంటే గిట్టవు" అన్నది.

"అదా, ఆమెకు ఇటువంటివంటే గిట్టవేం? అందుకనేనా అలావెళ్ళింది!" ఏలోకేసి ఆశ్చర్యంతో అన్నది.

"అయితే కావచ్చు. కాని, మరోసంగతి నాయనా! నీవు చదువు సంధ్యలవీ బాగానేర్చి మీ తల్లికష్టాలు ఈడేర్చు

అమూల్యునితో అతిగా కలిసి మెలిసి తిరగకు! వాడింకా చిన్నవాడు, నీకన్నా చాల చిన్న" అన్నది అన్నపూర్ణ.

వెలోకేసికి ఈ మాటలు రుచించలేదు. "అది నిజమే అన్నపూర్ణగారూ! పేదవాళ్ళ పిల్లవాడు పేదవాళ్ళ పిల్లల లాగానే ఉండాలి. అందుకు నే నొప్పుకుంటా. అయితే మీ వాడు పసివాడైతే మావాడేమంత ముదుసలా? ఒకయేడూ, అరయేడూ పెద్దయితే అదొక లెక్కలోనిదా? వీడేమీ గొప్పవాళ్ళ పిల్లల నెరగడనుకున్నారా? ఇక్కడే చూస్తు న్నాడనుకున్నారా? వాళ్ళ నాటక కంపెనీలో ఎంతమంది రాజులు, రాజకుమార్తెలు ఉన్నారో మీ కేమైనా తెలుసా!" అన్నది.

అన్నపూర్ణ దెబ్బతిన్నది. "ఎబ్బెబ్బె, నేనలా అనలే దండీ! నా ఉద్దేశ్యం..."

"ఇంకా అనేదేముందండీ? మేముమాత్రం తెలుసు కోలేనంత మూర్ఖులము కాదు, నరేంద్రుడు చదువుకుంటాడు— రమ్మని అన్నయ్య రాస్తే వచ్చాంగాని, తిండికి జరక్కరాలేదు"

అన్నపూర్ణ సిగ్గుతో చచ్చిపోయింది. "భగవంతుని సాక్షిగా, నేనలా అనలేదమ్మా. బాగా చదువుకొని అమ్మ కష్టాలు ఈడేర్చమని అన్నాను" అన్నది.

వెలోకేసి "మంచిది, మంచిది" అని కొడుకు నుద్దేశించి "వెళ్ళరా నరేన్, నువ్వు బైటకువెళ్ళి కూర్చో. పెద్దవాళ్ళ పిల్లలతో కలసిమెలసి తిరక్కు" అని తన కొడుకును లేపి, తను లేచి వెళ్ళిపోయింది.

అన్నపూర్ణ తుఫానులాగ బిందు గదిలోకి వచ్చి దూది లాగ అయి, "నీకోసం చుట్టరికాలు కూడా వదులుకోవాలా ఏమిటి? అక్కడనుంచి ఎందుకు లేచివచ్చావో చెప్పు" అన్నది.

బిందు సామాన్యంగానే జవాబు చెప్పింది. "నాకోసం మీరు చుట్టరికాలను వదులుకోవటమెందుకు అక్కా? మీ బంధువులతో సుఖంగా ఉండండి. నేను నా బిడ్డను తీసుకుని పలాయనం చిత్తగిస్తాను" అన్నది.

'పలాయనం చిత్తగించే దెక్కడికో కొంచెం చెబుదూ!'

"వెళ్ళేప్పుడు వూరూ, పేరూ మరీ చెప్పిపోతాలే, మీరాంచింత పడవద్దు.

"నలుగురిముందూ తలెత్తుకు తిరక్కుండా చేస్తేగాని వదిలిపెట్టవని నాకు తెలుసు. ఈవిడమూలంగా నా వళ్ళు హూనం అయిపోతూంది" అని చెబుతూ, వెళుతూ అన్నపూర్ణ మాధవుడు రావటంచూచి "లేదండి మరదిగారు, మీరింకోచోటకి వెళ్ళిపోయినా సరే, లేకపోతే ఈవిడను వదిలేసినా సరే. ఈవిడ ఈ ఇంట్లోవుంటే నేనిక ఇక్కడ కాపరం చెయ్యలేను" అని వెళ్ళిపోయింది.

మాధవుడు ఆశ్చర్యపడి "ఏమిటి సంగతి?" అని భార్య నడిగాడు.

"నాకేం తెలియదు. వదినగారు చెప్పిందిగా నన్ను వెళ్ళగొట్టి వెయ్యమని" అన్నది బిందు.

మాధవుడు ఇంకేం మాట్లాడక టేబులుమీద నున్న వార్తాపత్రిక తీసుకొని బైటగదిలోకి వెళ్ళిపోయాడు.

## ౫

ఏలోకేసి పైకి సాధువలా కనిపించుతుంది గాని, అసలు ఆమె సాధువమాత్రం కాదు. పిల్లా జెల్లా లేని బిందువాసిని వద్ద ధనపుమూట లున్నాయని తెలిసిన వెంటనే ఏలోకేసికి ఆమెయెడ అమితమైన ప్రేమ పుట్టుకొచ్చింది. రోజూ రాత్రి భర్త దగ్గర కెళ్ళి "నీమూలానే అంతా చెయి జారిపోయింది. వృధాగా నీవద్దవుండక నేనిక్కడ ఉండిపోయినట్లయితే ఈపాటికి రాజమాత నైపోయేదాన్ని. చంద్రుడులాంటి మన పిల్లవాణ్ణి వదిలిపెట్టి బిందు ఆ కొరివిమొద్దును..." అని ఒక దీర్ఘనిశ్వాసతో ఆ నల్లమొద్దు పరమాయుష్యమంతా వూదేసి "పేదల పాలిటి దేవుడున్నాడు" అని ముగిస్తూ మెదలకుండా నిద్ర పోయేది. ప్రియనాథుడు కూడా తన తెలివితక్కువ తనానికి చింతిస్తూ చింతిస్తూ నిద్రపోయేవాడు. ఈ విధంగా ఈ దంపతులకాలం గడుస్తూ వుంది. బిందువాసినియందు ఏలోకేసి ప్రేమ వరదనీరులాగ పొంగుకొస్తూ వుంది.

ఒకనాడు రెండు ఝాములప్పుడు ఏలోకేసి బిందువాసినిని చూసి "నీది నల్లమేఘాల్లాంటి తలకట్టు. ఎప్పుడూ జడ వేసుకున్నట్టే ఉండవు. ఇవ్వాళ జమీందారుగారి అమ్మాయిలు ఆడుకోటానికి వస్తారు. జడ వెయ్యనా!" అన్నది.

"వద్దండీ! మేలిముసుగు వేసుకోటానికి వీలుండదు. అదీగాక కుర్రవాడు పెద్దవాడయ్యాడు. చూచిపోతాడు" అన్నది బిందు.

వేలో కేసి చూసుపోయి "ఏమిటావమాటలమ్మా! కుర్ర వాడు పెద్దవాడైతే ఆడవాళ్ళు జడ వేసుకోరూ? మా నరేం ద్రుడు, వాడి పగవాళ్ళ కళ్ళల్లో దుమ్ముపడ - మరో ఆర్నెల్లు పెద్దవాడే అలాఅని నేను తలదువ్వుకోటం మానేస్తాన టమ్మా!" అన్నది.

"మీరు మానెయ్యట మెందుకు? నరేంద్రుడు మొదట నుంచీ మీరు దువ్వుకోటా, జడ వేసుకోటం చూస్తూ వస్తున్నాడు. వాడిసంగతి వేరు. నేను ఇవ్వాళ కొత్తగా జడ వేసుకుంటే అమూల్యుడు వింతగా చూస్తాడు. గల్లంతు చేస్తాడో ఏమోకూడా తెలియదు. ఛీ! ఛీ! నాకు తలవంపు అవుతుంది" అన్నది బిందు.

అన్నపూర్ణ ఏదోపనిమీద అటే వెళుతూ అటు కేసి చూసి. చటుక్కున ఆగిపోయి "ని కళ్లు అలా ఎర్రగా ఉన్నయ్యేమమ్మా? ఇటురా కళ్ళు చూస్తాను" అన్నది.

వేలో కేసి వుండటంవల్ల బిందు చాల సిగ్గుపడి "రోజూ వళ్ళేం చూస్తావు నేనేం పసిపిల్లనా జబ్బుచేస్తే తెలుసుకోలేక పోవటానికి..." అన్నది.

"కాదు, నువ్వు పెద్దదానివి ఇటు దగ్గరికి రా. శ్రావణ భాద్రపద మాసములు ఆరోగ్యమైన మాసములు కావు" అన్నది అన్నపూర్ణ.

"నేను రాను, ఏమీ లేదు. చాలా బాగున్నాను" అన్నది బిందు.

"సరే, నాదగ్గరేమీ దాచకు" అని ప్రేమదృష్టులు ప్రసరింపజేస్తూ వెళ్ళిపోయింది అన్నపూర్ణ.

"ఆమె మాటల్లో కొంచెం ఆడంబరం ఉందికదూ?" అన్నది ఏలోకేసి.

బిందు ఒక్క క్షణం స్థిరంగా నిలుచుని "అటువంటి ఆడంబరం అందరికీ యిస్తాడు భగవంతుడు" అనేసరికి నోరు మూసుకు వూరుకుంది.

ఏదో వస్తువు చేతపట్టుకొని ఆ దారినే వెళుతున్న అన్న పూర్ణను పిలచి "ఇదుగో అక్కా, తల దువ్వించుకుని జడ వేయించుకుంటావు?" అన్నది బిందు.

అన్నపూర్ణ వెనక్కి తిరిగి నుంచుని, కాస్సేపు మొదల కుండా చూసి సంగతి గ్రహించి ఏలోకేసితో "నేనెంతో చెబుతాగమ్మా. ఆవిడతో చెప్పటం వ్యర్థం. ఇంత తలకట్టు వున్నా జడవేసుకోదు. ఇన్ని నగలున్నా పెట్టుకోదు. ఒక నాడూ సరైన చీరకట్టుకోదు. అంత అందం సరిగా చూచు కోదుకూడా. ఈవిడ సంగతులన్నీ లోకానికి విరుద్ధంగా ఉంటాయి. కుర్రవాడు కూడా అలాగే తయారు. ఆ నాడు ఏమన్నాడో విన్నావా బిందూ! "బట్టలు కట్టుకుంటే ఏమి వస్తుంది నా అమ్మకు ఎన్ని వున్నై. కట్టుకుంటుందా ఏమిటి? అన్నాడు" అన్నది.

బిందు సగర్వంగా తల త్రిప్పి "కాని చూడు అక్కా! కుర్రాణ్ణి నరుగురిలో ఎన్నికయినవాణ్ణిగా తయారు చెయ్యా లంటే-తల్లి లోకవిరుద్ధంగా వుండటం అవసరం! అప్పటివరకు బ్రతికుంటే లోకులంతా, ఇదిగో ఈమె అమూల్యుని తల్లి. అనటం వింటావు" అంటూవుండగానే ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగినై.

అన్నపూర్ణ అదిమాసి ప్రేమతో "అందుకనే మీ అబ్బాయిని గురించి మేమేం పట్టించుకోము. దేవుడు నీ కోరిక తీరుస్తాడు. కాని కుర్రవాడు పెద్దవాడౌతాడు. నలుగురిలో ఎన్నిక పొందుతాడని నాకు ఆశలేదు" అన్నది.

బిందు చెరగుతో కళ్లు తుడుచుని "నేను ఆ ఒక్క ఆశ పెట్టుకునే బ్రతుకుతున్నాను అక్కా" అన్నది. ఆమె శరీర మంతా గగుర్పొడిచింది. ఆమె సిగ్గుపడి బలవంతంగా నవ్వి "కాదక్కా! నా ఆశకేనాడైనా దెబ్బతగిలిందంటే నాకు పిచ్చెత్తుతుందమ్మా" అన్నది.

అన్నపూర్ణ స్తబ్ధయై ఉండిపోయింది. ఆమెకీ తోడి కోడలి హృదయం తెలియక కాదు. కాని ఆమె ఆశా-ఆకాం క్షలయొక్క తీవ్రస్వరూపం ఇంత విస్పష్టంగా చూడలేదు. బిందు అమూల్యుని విషయంలో యెక్కువలా ఎందుకు కని పెట్టుకు వుందో, దయ్యాంగా ఎందుకు తయారయిందో ఆమె కీనాడు తెలిసింది. తన బిడ్డకి స్వశుభాకాంక్షిణి ఆమె మొహం చూసి చెప్పరాని వాత్సల్యమాధుర్యంచే ఆ తల్లి హృదయం పొంగి పొరలింది. ఆమె పొంగుకొస్తున్న కన్నీటిని ఆపుకునేందుకు మొహం తిప్పుకుంది

"సరేకాని, ఇవ్వాళ నీకు..." అని వేలో కేసి అంటూ వుండగానే బిందు చప్పున ఆపి, "ఇవ్వాళ అక్కకు వెయ్యండి. నేనీ ఇంటికి వచ్చినతరువాత జడవేసుకోగా నేనెన్నడూ చూడలేదు" అని నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

నాలుగైదు రోజులు గడిచిన తరువాత ఒకనాటి ఉదయం ఇంటిమంగలి యాదవబాబుకు పనిచేసి పైనుంచి దిగి

వస్తున్నాడు. అమూల్యుడు అతనిదారి కడ్డుగొట్టి "కైలాస్, మా నరేంద్రుడికి చేసినట్లు నాకు చేయగలవ్ ?" అన్నాడు.

మంగలి ఆశ్చర్యంతో—"ఎలా చేశారేమిటి ?" అని అడిగాడు. అమూల్యుడు తనతల అక్కడక్కడ్క చూపిస్తూ, "ఇదిగో చూడు, ఇక్కడ ముప్పాతిక, ఇక్కడ పాతిక, ఇక్కడ పరక, ఇదిగో ఇక్కడ మెడమీద నీవెంత అంటకత్తిరి వెయ్య గలవో అంత కత్తిరెయ్యి.

మంగలి నవ్వి "అలా మా బాబుకూడా చెయ్యలేడు" అన్నాడు.

అమూల్యుడు వదిలిపెట్టలేదు. "అదేమంత కష్టంకాదు కైలాస్ ! ఇక్కడ ముప్పాతిక ఇక్కడ పాతిక..." అన్నాడు. మంగలిని ప్రోత్సహిస్తూ.

మంగలి తప్పించుకోటానికి, "అయితే ఇవ్వాళ నాగ మేమిటి ? మీ చిన్నమ్మగారి సెలవులేకపోతే నేను కత్తిరించ లేను బాబయ్యా !" అన్నాడు.

"అయితే ఆగు, నేను అడిగివస్తా" అని ఒక అడుగు ముందుకువేసి మళ్ళా వెనక్కి తిరిగివచ్చి—"అయితే, నీ గొడుగు ఇటివ్వు. లేకపోతే పారిపోతావు" అని బలవంతంగా గొడుగు లాక్కుని పరుగెత్తుకుపోయి, తుఫానల్లే చిన్నమ్మ గదిలో ప్రవేసించి "అమ్మా ! తొందరగా ఒకసారి బైటికి రా" అన్నాడు.

బిందువాసిని అప్పుడే స్నానంచేసి పూజ చేసుకో బోతూవుంది. కంగారుపడి "తాకకు తాకకు, పూజచేసుకోబో తున్నాను" అన్నది.

"అమ్మా! పూజ తరువాత చేసుకుందువుగాని, ఒక సారి బైటకువచ్చి చెప్పిపో, లేకపోతే కత్తిరెయ్యనంటున్నాడు. బైట నుంచున్నాడు."

బిందుకు కొంచెం ఆశ్చర్యం వేసింది. ఎందుకంటే అమూల్యునికి పనంటే ప్రాణకంటకం. అటువంటి వాడిప్పుడు తనంతట తానే ఎందుకు ఇష్టపడుతున్నాడో తెలియక బైటకు వచ్చేసరికి మంగలి "అబ్బాయిగారు నా పీకమీద కూర్చున్నారు అమ్మగారూ! నరేంద్రబాబులాగ ముప్పాతిక, పాతిక, పరక... అలా నేను చేయగలనండీ" అన్నాడు.

"బాగానే చేయగలవు. అయితే ఆగు, నరేంద్రుణ్ణి పిలుచుకు వస్తాను" అని అమూల్యుడు పరుగెత్తుకు వెళ్లాడు.

నరేంద్రుడు ఇంట్లో లేడు. కొంచెంసేపు అటూయిటూ వెతికి తిరిగివచ్చి నుంచుని చూపించరాదు అమ్మా! సరిగా చూపు... ఇక్కడ ముప్పాతిక, ఇక్కడ పాతిక, ఇక్కడ పరక, ఇక్కడ అంటకత్తిరింపు..." అన్నాడు.

అమూల్యుని గడబిడచూచి బిందు నవ్వి "నేనిప్పుడు పూజజేసుకోవాలిరా!" అన్నది.

"పూజ తర్వాత చేసుకుందువుగాని, లేకపోతే ముట్టుకుంటా."

బిందుకు మరో ఉపాయంతోచక నిలబడక తప్పింది కాదు.

మంగలి కత్తిరించటం మొదలెట్టాడు. బిందు కన్నుగిలిపింది. తలంతా సమానంగా కత్తెర పడ్డది. అమూల్యుడు

చేత్తో తడుముకొని సంతోషంతో "బలే బాగావుంది" అని గంతులేసుకుంటూ వెళ్ళిపోయాడు.

మంగలి గొడుగు చంకలో పెట్టుకుని "రేపు నేను ఈ ఇంట్లో అడుగుపెట్టటం కష్టం అమ్మగారూ!" అన్నాడు.

వంటలక్క పళ్ళాల్లో అన్నం వడ్డించి పిలుస్తూవుంది. బిందు వంటింట్లో ఒకమూల కూచుని గిన్నెలో పాలుపోస్తూ అమూల్యుడు బాబాయి తల దువ్వుకునే బ్రష్‌కోసం మారాం చెయ్యటం విన్నది. కొంచెంసేపటికి అమూల్యుడు ఏడుస్తూ వచ్చి బిందువీపుమీద పడి "అంతా పాడుచేశాడు, రేపు వాణ్ణి చంపిపారేస్తా" అన్నాడు.

బిందు మరి నవ్వు ఆపుకోలేకపోయింది. అమూల్యుడు వీపుమీదనుంచి లేచి, కోపంతో "నీ కళ్ళు పోయాయా? కనపడటంలేదా!" అని ఏడవటం మొదలుపెట్టాడు.

ఈ యేడుపు విని అన్నపూర్ణ అక్కడకువచ్చి "ఇంతలో ఏం మునిగిపోయింది. రేపొచ్చి మళ్ళా సరిచేసి పోతాడు" అన్నది.

అమూల్యుడు మండిపడి "రేపు చేసేదెలా? ఇక్కడ ముప్పాతిక పొడుగు ఉండాలి. అంతా అంటక త్తిరింపు చేశాడు" అన్నాడు.

అన్నపూర్ణ అతణ్ణి శాంతిపరచటానికి "ముప్పాతిక లేకపోయినా అరయినా ఉంది" అన్నది!

"మట్టివుంది. అరవుంటే ఫేషనా? నరేంద్రుణ్ణడుగు, ఇక్కడ ముప్పాతిక ఉండాలి" అని అమూల్యుడు అన్నంకూడా సరిగ్గా తినక అటూఇటూ విసిరిపారేసి లేచిపోయాడు.

"నీ కొడుక్కి క్రాపింగు మోజు ఎప్పటినుంచి ఆరంభ మైంది ?" అన్నది అన్నపూర్ణ. బిందు నవ్వింది. కాని మరు క్షణంలోనే గంభీరురాలై నిట్టూర్చి, "అక్కా! సామాన్య విషయం కాబట్టి నవ్వువచ్చింది. అన్నీ ఇలాగే ఆరంభమౌతా యేమోనన్న భయంతో నా గుండెలు పగిలిపోతున్నా యమ్మా" అన్నది.

అన్నపూర్ణ మరి మాట్లాడలేకపోయింది.

*　　*　　*　　*　　*

దుర్గాపూజ లొచ్చాయి. ఆ పేట జమీందారుగారింట ఉత్సవాలు మహాజోరుగా సాగుతున్నై. రెండు రోజులనుండి నరేంద్రుడు దానిలో మునిగి వుంటున్నాడు. సప్తమి రాత్రి అమూల్యుడు బిందువెంట పడ్డాడు.

"హరికథ చెబుతున్నారు, పోతాను" అన్నాడు.

"చెబుతున్నారా! చెబుతారా" అడిగింది బిందు.

"రాత్రి మూడుగంటలకు మొదలెడతారని నరేంద్రుడు చెప్పాడు" అన్నాడు అమూల్యుడు.

"అయితే ఇప్పటినుంచీ ఆ మంచంలో పడివుంటావా ! అలా వీల్లేదు. రేపొద్దున మీ బాబాయివెంట వెళుదువుగాని మంచిచోటు దొరుకుతుంది."

అమూల్యుడు ఏడుపుమొహంపెట్టి "ఆఁ ఆఁ, నన్ను పంపవు! బాబాయి వెళతాడో వెళ్ళడో! వెళ్తే ఎన్ని గంట లకు వెళ్తారో ! నన్నిప్పుడు వెళ్ళనివ్వవూ ?" అన్నాడు.

"మూడు నాలుగింటికగా మొదలెట్టేది. అప్పుడు నౌకరుచేత పంపిస్తా. నువ్విప్పుడు పండుకో" అన్నది బిందు.

అమూల్యుడికి కోపంవచ్చి గోడకు మొహంపెట్టి మంచంమీద ఒకమూల పడుకున్నాడు. బిందు అతణ్ణి చేయి పట్టుకు లేవదీయబోయింది. అమూల్యుడు ఆమెచేతిని విదిలించికొట్టి పండుకున్నాడు, కొంతసేపయింది. బహుశా ఇంట్లో అందరూ నిద్రపోయి వుండవచ్చు. బైట గడియారం గంటలు కొట్టేటప్పటికి అమూల్యుడికి మెలకువవచ్చింది. అతను చెవులు నిక్కబొడిచి విన్నాడు ఒకటి, రెండు, మూడు నాలుగు... అతడు గబగబా లేచికూర్చొని "అమ్మా! లేవే, మూడు నాలుగు అయింది" అని గొడవచేయటం మొదలెట్టాడు. బైట గడియారం ఇంకా మోగుతూనే వుంది. అయిదు, ఆరు, ఏడు, ఎనిమిది. అమూల్యుడు ఏడ్చాడు. "ఏడుగంటలైంది. ఇంకెప్పుడు పోను?" బైటగడియారం ఇంకా కొడుతూనేవుంది. తొమ్మిది, పది, పదకొండు పన్నెండు. గడియారం పన్నెండు కొట్టి ఆగిపోయింది. అమూల్యుడు తన పొరపాటును తెలుసుకుని సిగ్గుపడి మెదలకుండా నిద్రపోయాడు. గదిలో మరో మూల మంచంమీద నిద్రపోతున్న యాదవుడికి యీ గందరగోళంతో మెలకువ వచ్చింది. అతడులేచి నవ్వి "ఏమిట్రా నాయనా?" అన్నాడు. అమూల్యుడు సిగ్గుపడి మెదలకుండా ఊరుకున్నాడు. బిందునవ్వి "ఇవ్వాళ వాడు నన్ను లేవగొట్టటం చూస్తే—ఇల్లు తగులబడ్డాకూడా అంత గల్లంతు చెయ్యరు" అన్నది. అమూల్యుడు నిస్తబ్ధతతో పడివుండటం చూచి బిందుకు జాలివేసింది. "సరే, ఇక హరికథకు వెళ్ళ

ఎవరితోనూ పోట్లాడకేం ?" అని భైరవణ్ణి పిలచి లాంతరిచ్చి పంపింది.

అమూల్యుడు హరికథ విని పొంగిపోతూ మరునాడు పదిగంటలకు ఇంటికి వచ్చీరావడంతోనే పినతండ్రినిచూచి "నువ్వు రాలేదేం ?" అన్నాడు.

"ఎలా వుందిరా ?" బిందు అడిగింది.

"చాలా బాగుందమ్మా! బాబాయి, ఇవ్వాళ సాయంత్రం నాట్యమట. కలకత్తానుండి ఇద్దరు నాట్యకత్తెలు వచ్చారు. నరేంద్రుడు చూపించాడు. ఎలా ఉన్నారనుకున్నావు ? అచ్చంగా అమ్మవార్లే వున్నారు. ఎంతో బాగున్నారు. వాళ్ళాడతారని నాన్నను కూడా చెప్పేశా" అన్నాడు అమూల్యుడు.

"చాల మంచిపని చేశావు" మాధవుడు బిగ్గరగా నవ్వాడు.

కోపంతో బిందుమొహం ఎరబడింది. మీ గుణాల రాసి మేనల్లునిమాట విన్నారా ? వెధవా ! నీవిక అక్కడికి వెళ్ళవద్దు ! నాలాగ ఉన్నారని నీకెవరు చెప్పారురా ? నరేంద్రుడా ?" అన్నది,

అమూల్యుడు భయపడుతూ భయపడుతూ "ఔను. వాడే చూచివచ్చాడు" అన్నాడు

"ఏడీ నరేంద్రుడు. రంనీ వాణ్ణి!" అన్నది బిందు.

మాధవుడు నవ్వాపుకుని "నీకేమన్నా వెర్రా. ఈ గాథంతా అన్నగారిచెవిని పడితేట్టున్నది. ఇక గడబిడచేయకు" అన్నాడు.

దానితో బిందు కోపం దిగమింగి లోలోనే కుమల సాగింది.

ప్రొద్దుగూకకముందే అమూల్యుడు అన్నపూర్ణ వెంట పడి "నాట్యం చూట్టానికి వెళతానే! చూచి ఇప్పుడేవస్తాను" అన్నాడు. పనితొందరలోనున్న అన్నపూర్ణ "వెళ్ళను, అమ్మ నడుగు" అన్నది. అమూల్యుడు పట్టినపట్టు వదలక "లేదమ్మా ఆలస్యమేమీ చెయ్యను. ఇప్పుడే వస్తాను, చెప్పవ్!" అన్నాడు.

"వొద్దొద్దు! మీ అమ్మకు కోపం వస్తుంది. ఆమెనే వెళ్ళి అడుగు" అన్నది అన్నపూర్ణ.

అమూల్యుడు అన్నపూర్ణ పయిటచెంగు పట్టుకు అటూ ఇటూ లాగి, ఏడుస్తూ "నువ్వు చెప్పకు! నేను నరేంద్రుడితో వెళ్ళి వెంటనే వస్తా" అన్నాడు.

"నీవు నరేంద్రుడితో వెళితే..." అని అన్నపూర్ణ ఏదో అనబోతూవుండగానే అమూల్యుడు దౌడుతీశాడు.

గంటసేపైనతర్వాత బిందువాసిని అమూల్యుని వెత కటం ఆరంభించిందని అన్నపూర్ణ కనిపెట్టి కిక్కురుమనకుండా వూరుకుంది. క్రమంగా వెతకటం ఎక్కువైన తర్వాత ఆమె మెల్లగా బయటికి వచ్చి "అక్కడ నాట్యం జరుగుతూవుందట. నరేంద్రునివెంట వెళ్ళాడు. ఇప్పుడే వస్తాడు, మరేం భయం లేదు" అన్నది.

"ఎవరెళ్ళమన్నారు? మీరా?" అన్నది బిందు. దగ్గ రకువచ్చి-తనను చెప్పకుండానే అమూల్యుడు తనంతట తానే

వెళ్ళాడని చెప్పటానికి అన్నపూర్ణ భయపడి "ఇప్పుడే వస్తాడులే" అన్నది.

ఈ మాటవిని బిందు తెల్లముఖం వేసుకొని అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

కొంచెంసేపటికి అమూల్యుడు ఇంటికివస్తూనే పినతల్లి పిలుపువిని భయంతో మాట్లాడకుండా వెళ్ళి తండ్రి మంచంమీద పండుకున్నాడు.

యాదవుడు కళ్ళజోడు పెట్టుకుని దీపంముందు భాగవతం చదువుకుంటున్నాడు. ముఖంపైకెత్తి "ఎవరు? అమ్మూ..." అన్నాడు. అమూల్యుడు మాట్లాడలేదు. కదంబం వచ్చి "అమ్మగారు పిలుస్తున్నారు పదండి" అన్నది. అమూల్యుడు వెళ్ళలేక తండ్రిదగ్గరకెళ్ళి "నువ్వు పంపించిరా నాన్నా!" అన్నాడు. యాదవుడు ఆశ్చర్యపడి "నేను పంపించిరానా? ఏమి జరిగిందేమిటి కదంబం?" అన్నాడు. కదంబం జరిగినసంగతంతా చెప్పేసింది.

"ఒకరు వద్దన్నారు. ఒకరు వెళ్ళమన్నారు." దీని మీద కలహం తప్పదని గ్రహించి, యాదవుడు అమూల్యుని వెంటబెట్టుకుని వెళ్ళి మరదలి గదిబైట నుంచుని "ఈ సారి క్షమించు. ఇంకెప్పుడూ అటువంటి పనులు చెయ్యడట" అన్నాడు.

ఆ రాత్రి తోడికోడళ్ళిద్దరూ అన్నాలముందు కూర్చున్నారు. "నాకు నీమీద కోపమేమీ లేదక్కా! నేనిహ ఇక్కడ ఉండలేను. ఉంటే అమూల్యుడు బొత్తిగా చెడిపోతాడు. నేను వెళ్ళొద్దనకపోతే సరే, వెళ్ళవొద్దు అని గట్టిగా

చెప్పితినమ్మో. అయినా వీళ్ళకింత దుస్సాహసం ఎక్కడినుండి వచ్చిందా అని ఇందాకటినుండీ ఆలోచిస్తున్నా, వీళ్ళ పాడు బుద్ధిమాటు నాదగ్గిరికిరాక నీ దగ్గరికిరావటం, ఇంటికి రావటం తోనే నా పిలుపు విని వెంటనే తండ్రిదగ్గరకుపోయి ఆయన్ను వెంటవేసుకు రావటం. ఇంతన్నాకు వీళ్ళకి పాడుబుద్ధులు లేవన్నా నేను కలకత్తాలో ఇల్లు అద్దెకు తీసుకొని వుంటాను అదే మంచిది. ఒక్కగానొక్క బిడ్డ చెడిపోతుంటే జీవితపర్యాంతం చూస్తూ వూరుకునేకన్నా ఇదే మంచిది" అన్నది బిందు.

అన్నపూర్ణ మనసులో బాధపడి "మీరంతా వెళ్ళి పోతే నేనొక్కతెను ఎలా ఉండగలనమ్మా? చెప్పు?" అన్నది.

బిందు కొంచెంసేపు ఊరుకుని "అది నీకే తెలియాలి. నా నిర్ణయం చెప్పేశాను. ఆ పాడువాడు నరేంద్రుడు" అన్నది.

"అలాగా! నరేంద్రుడేమి చేశాడు? వీళ్ళిద్దరూ అన్న దమ్ములైతే ఏమిచేసేదానివి?"

"ఏంచేసేదాన్నా? నౌకరుచేత కాళ్ళూ చేతులూ కట్టించి, వేముబెత్తముపెట్టి వీపు పగలగొట్టి గెంటేదాన్ని. ఈ అయితే గియితేల్లు పని కాదమ్మా! ముందు వీళ్ళ నిక్కడనుంచి పంపెయ్యి" అన్నది బిందు.

ఈ మాటను అన్నపూర్ణ అసంతృప్తిపడి "పంపటం, పంపకపోవటం నా చేతిలోపనా? వీరి నిక్కడకి తీసుకొచ్చిన వారితో చెప్పాలిగాని, నాతో చెప్పి ఏమి లాభం?" అన్నది.

"నేనీ సంగతులన్నీ బావగారితో ఎలా చెప్పేదమ్మా?"

"అన్నీ ఎలా చెబుతున్నావో ఇగ్గి అలాగనే!''

బిందు ముందుపళ్లెం దూరంగాతోసి "నన్ను వెర్రిదాని కింద కట్టకు అక్కా! నాకూ ఇరవైయేడు, ఇరవై ఎనిమిదేళ్లు వచ్చినై. ఇది ఇంట్లో నౌకర్ల-చాకర్ల మాట కాదు, ఆత్మీయులకు సంబంధించినది. నీ వుండగా నేనీ మాటలన్నీ బావగారికి చెబితే వారికి కోపంరాదూ?'' అన్నది.

"అవును. తప్పకుండా వస్తుంది. కాని నేను చెప్పానంటే జీవితపర్యంతం నా మొహం చూడరు. లక్ష చెప్పు, మనం పరాయివాళ్ళం. వాళ్ళు అన్నా - చెల్లెళ్లు అన్నసంగతి ఆలోచించవేం? అదీగాక, నేను పెద్దదాన్నయ్యే. ఈ చిన్నవిషయానికి నేను చిందులు తొక్కితే లోకులు నన్ను పిచ్చిది నరు!"

అన్నది అన్నపూర్ణ.

బిందు పళ్లెం మరికొంచెం దూరంతోసి మూతిముడుచుకు కూర్చుంది. బావగారి భయంతో అలా కూర్చుందని గ్రహించి అన్నపూర్ణ "చేతులు ముడుచుకు కూర్చున్నావు. ఆ పళ్ళేమేమి పాపం చేసింది'' అన్నది.

బిందువాసిని హఠాత్తుగా నిట్టూర్చి "నేను తినేశాను" అన్నది.

అన్నపూర్ణ ఆమె అలక కనిపెట్టి మళ్లా ఏమీ అనలేకపోయింది.

బిందుగదిలో పడుకోబోయి పక్కమీద అమూల్యాని కానక తిరిగివచ్చి "వాడెక్కడి కెళ్ళాడు?'' అని అడిగింది తోటికోడల్ని.

"ఇవాళ నా మంచంమీద పడి నిద్రపోతున్నట్టున్నాడు. వెళ్ళి తీసుకురానా?'' అన్నది అన్నపూర్ణ.

"వద్దులే, వుండనీ'' అని బిందు మొహం గంపెడు చేసుకొని వెళ్ళిపోయింది.

నడిరాత్రి అన్నపూర్ణ పిలుపుతో బిందువాసిని కలత నిద్ర భగ్నమైంది.

"ఏమిటి అక్కా?''

అన్నపూర్ణ బైటనుంచి "తలుపు తియ్యి. నీ కుర్రాణ్ణి నువ్వే తీసుకో. వీడి గడుగ్గాయితనం నేను కాదుగదా, నా అబ్బొచ్చినా భరించలేడు'' అన్నది అన్నపూర్ణ.

బిందు తలుపు తెరవగానే అన్నపూర్ణ అమూల్యుని తీసుకొని గదిలోకెళ్ళి "ఇలాంటి గడుగ్గాయిని నే నెక్కడా చూడలేదు బిందూ! రాత్రి రెండయినా రెప్పవాల్చనిస్తేనా! దోమలు కుడుతున్నాయంటాడు, మంచినీళ్లు కావాలంటాడు. కొంచెంసేపుండి చెమట పోస్తూవుంది, విసరమంటాడు. పగలంతా నేను పనిచేసి సొక్కివుంటాను. రాత్రి నిద్రలేంది బ్రతికలేనమ్మా'' అన్నది.

బిందు నవ్వి చెయిజాపగానే అమూల్యుడు ఒక్క గంతున ఆమె ఒళ్ళోకెళ్ళి పండుకొని నిమిషంలో రెప్పవాల్చాడు. మరొకవైపున మంచంమీద పండుకొనివున్న మాధవుడు "ఉబలాటం తీరిందా వదినా?'' అని పరిహసించాడు.

"నేనేం వుబలాటపడలేదు బాబూ! వాడే నల్లి కుడుతుందని భయంతో అక్కడచేరి నిద్రపోయాడు. నాకు తెలీద

శాస్త్రి జరిగింది. నీదగ్గర పండుకోటానికి సిగ్గేస్తుంది — అని అంటాడు నాతో. వాడి హాస్యపుమాటలు చూశారా!" అన్నది అన్నపూర్ణ.

ఈ మాటకు ముగ్గురూ నవ్వుకున్నారు. "ఇవ్వాల్టికి చాలు, చాల ప్రొద్దుపోయింది అన్నది అన్నపూర్ణ.

* * * * *

ఇది జరిగిన పదిరోజులకు బిందువాసికి పుట్టింటికి రమ్మని కబురొచ్చింది. వారు తీర్థయాత్రలకు వెళ్తూ కూతుర్ని చూడాలని మేనా పంపారు. బిందు తోటికోడలి అనుమతి పుచ్చుకొని రెండుమూడు రోజులుండి రావటానికి అమూల్యునికి తెలియకుండా కన్నవారింటికి ప్రయాణపు ఏర్పాట్లు చేస్తూవుంది. ఇంతలో చంకన పుస్తకాలు పెట్టుకొని బడికి పోతూ అమూల్యుడు అక్కడికి వచ్చాడు. ఇంతకుముందు అతను వాకిట్లో మేనాపెట్టి వుండటం చూచివచ్చాడు. ఇట్లోకి వచ్చేసరికి బిందుకాళ్ళకు పారాణి కనపడ్డది. "కాళ్ళకు పారాణి ఎందుకు పెట్టుకున్నావమ్మా!" అడిగాడు.

అన్నపూర్ణ దగ్గరేవుంది.

"ఇవ్వాళ అలా పెట్టుకోవాలి" అన్నది బిందు.

అమూల్యుడు బిందును ఆ పాదమస్తకం రెండు మూడుసార్లు చూచి "ఈ నగలన్నీ పెట్టుకున్నదెందుకు!" అని అడిగాడు.

అన్నపూర్ణ మొహంమీదికి పైటతీసుకొని బైటకు వెళ్ళిపోయింది. బిందు నవ్వాపుకొని, "ఎప్పుడో నీ పెళ్ళాం

వస్తుంది. నగలు పెట్టుకుంటుందని, ఇప్పణ్ణుంచీ మమ్మల్ని నగలు పెట్టుకోవద్దంటావేరా ? నువ్వు బళ్లోకి పో" అన్నది.

అమూల్యుడు ఈ మాట వినిపించుకోక "అక్క అలా నవ్వుతుందెందుకని ? ఇవ్వాళ నేను స్కూలుకు వెళ్ళను. నువ్వు ఎక్కడికి వెళ్తావు చెప్పు ?" అన్నాడు.

"నేను ఎక్కడికి వెళ్తే నీకేం ! నీ అనుజ్ఞ తీసుకుని వెళ్ళాలా ఏమిటి ?" అన్నది బిందు.

"నేనూ వస్తా" అని పుస్తకా లుచ్చుకొని వెళ్ళి పోయాడు.

అన్నపూర్ణ గదిలోకివచ్చి "వీడింత తేలిగ్గా బ్రతికిపోతా డనుకోలేదు నేను. ఎలా పసికట్టాడో చూశావా ? పారాణి ఎందుకు పెట్టావు ? నగలెందుకు పెట్టావు ! [illegible]న్ని ఆరాలో చూశావా ! ఎందుకుగాని వాణ్ణి వెంటబెట్టుకు వెళ్ళు. బళ్ళోంచి వచ్చినతరువాత నువ్వు కనపడకపోతే వీడు చేసే ఆగానికి అంతువుండదు" అన్నది.

"వాడు స్కూలుకు వెళ్ళివుంటాడనుకున్నావా అక్కా ! ఎప్పటికీ వెళ్ళడు. ఇక్కడెక్కడో నక్కి సమయానికి హాజరౌ తాడు" అన్నది బిందు.

సరీగ్గా అలాగే జరిగింది.

అతనెక్కడో దాక్కుని-బిందు అన్నపూర్ణ పాదాలకు నమస్కరించి మేనా ఎక్కబోయేప్పటికి ఎక్కడినుంచి వచ్చి పడ్డాడో ఏమో బిందువాసిని కొంగుపట్టుకు నిలబడ్డాడు. తోడి కోడళ్ళిద్దరూ నవ్వుకున్నారు.

"వెళ్ళేముందు గల్లంతు చెయ్యక, తీసుకుపో" అన్నది అన్నపూర్ణ.

"తీసుకువెళ్ళటానికి తీసుకువెళతాను. అక్కడైనా నన్నొక్కడుగు కదలనిస్తాడా? నేను వీడితో వేగలేను" అన్నది బిందు.

"నువ్వు తయారు చేసిందేగా వాణ్ణిలా? అమూల్య యీ రెణ్ణాళ్ళూ నువ్వు నా దగ్గర వుండిపో" అన్నది అన్నపూర్ణ.

అమూల్యుడు తలతిప్పుతూ "నేను నీ దగ్గర ఉండను" అని మేనాలోకెళ్ళి కూర్చున్నాడు.

౬

బిందు పుట్టింటి దగ్గరనుంచి తిరిగివచ్చిన పదిరోజుల కొకనాడు మధ్యాహ్నం అన్నపూర్ణ ఆమె గదిలోకి వెళ్ళి "చెల్లీ!" అన్నది

మాసినగుడ్డలు ఒక గుట్ట ముందు వేసుకొని దిగాలుపడి కూచునివుంది బిందు.

"చాకలొచ్చిందా?" అన్నపూర్ణ అడిగింది.

తోడికోడలేమీ మాట్లాడలేదు. అన్నపూర్ణ ఆమె మొహంకేసి చూసి భయపడింది. "ఏమి జరిగిందేమిటి?" ఉద్విగ్నురాలై అడిగింది.

బిందువాసివి కాల్చిన సిగరెట్టు పీకలు కొన్ని చూపించి "ఇవి అబ్బాయి చొక్కా జేబులోంచి బయట పడ్డాయి" అన్నది.

అన్నపూర్ణ స్తంభించి నిలబడిపోయింది.

బిందువాసిని ఒక్కసారి ఏడ్చి "నీ కాళ్ళట్టుకుంటా అక్కా! వారినైనా పంపివెయ్యి. లేకపోతే మమ్మలను ఎక్కడికైనా పంపు" అన్నది.

అన్నపూర్ణ జవాబు చెప్పలేకపోయింది. కొంచెంసేపు మెదలకుండా నుంచుని వెళ్ళిపోయింది.

మూడవ ఝామున అమూల్యుడు స్కూలునుండివచ్చి ఫలహారంచేసి ఆడుకోటానికి వెళ్ళిపోయాడు. బిందు అతన్ని పలకరించలేదు. ఇంతలో భైరవుడొచ్చి "అమ్మగారూ! నరేంద్ర బాబు నా తప్పేమీ లేనిదే లెంపకాయ కొట్టాడు" అని ఫిర్యాదు చేశాడు.

బిందు విసుక్కుని "వెళ్ళి అక్కగారితో చెప్పు" అన్నది.

మాధవుడు కోర్టునుంచి వచ్చి బట్టలు మార్చుకుంటూ సరసమాడబోయి విదిలింపుతిని నోరుమూసుకు పూరుకున్నాడు. ఎవరికీ తెలియకుండా ఎంతటి కారుమబ్బులు కమ్ముకు వస్తున్నాయో ఈ ఇంట్లో అన్నపూర్ణ కొక్కదానికే తెలుసు. సాయంత్రంవరకు ఏదోవిధంగా గడిపి చివరికి బిందు ఒంటరిగా ఉండటంచూసి వెళ్ళి చేతులుపట్టుకుని "ఎన్ని వచ్చినా వాడు నీ కొడుకే బిందూ! ఈసారికి వాణ్ణిక్షమించు అంతగా కాకపోతే చాటుకుపిలచి చీవాట్లు పెడుదుగాని" అన్నది.

"నా కొడుకు కాదన్నసంగతి నీకూ తెలుసు. ఇంకా అనవసరంగా మాటలు పెంచుకోవటం ఎందుకు అక్కా!" అన్నది బిందు.

"నేనుకాదు, నువ్వే వాడి తల్లివి. వాణ్ని నేను నీ చేతుల్లో పెట్టాను" అన్నది అన్నపూర్ణ.

"చిన్నతనంలో పెంచాను. ఇప్పుడు వాడు పెద్దవాడై పోయాడు. నీ బిడ్డను నువ్వు తీసుకో. నాకు సెలవిప్పించు" అని బిందు వెళ్ళిపోయింది.

రాత్రి ఏడుపుమొహం పెట్టుకుని అమూల్యుడు అన్నపూర్ణ దగ్గరకు పండుకోటానికి వచ్చాడు.

అన్నపూర్ణ ఈ రహస్యం తెలుసుకుని విరక్తితో "ఇక్కడికి వచ్చావెందుకు? పో ఇక్కడనుంచి" అన్నది.

అమూల్యుడు వెనక్కి తిరిగి చూశాడు. తండ్రి నిద్ర పోయాడు. ఇంకేం మాట్లాటకుండా అక్కడనుంచి మెల్లిగా వెళ్ళిపోయాడు.

కదాంబం తెల్లవారగట్ల అంట్లగిన్నెలు తీసుకు వెళ్ళటానికి వంటింట్లోకి వస్తూ అమూల్యుడు వరండాలో ఒక మూల పుల్లలు-పిడకలు కలిసిన గుట్టమీదపడి నిద్రపోవటం చూసి పరుగెత్తుకు వెళ్ళి బిందును లేపుకు తీసుకువచ్చింది. అన్నపూర్ణ కూడా నిద్రలేచి బయటికి వస్తూవుంది. దగ్గర కొచ్చి నిలబడింది.

బిందు తీక్షణస్వరూపంతో "వీడుంటే నిద్రరాదని-రాత్రి బయటికి గెంటావా అక్కా?" అన్నది.

కొడుకు అవస్థచూసి అన్నపూర్ణ కళ్ళల్లో నీళ్ళుకూడా తిరిగాయి. కాని బిందు నిష్ఠురంగా ఎత్తిపొడవటంవల్ల మండి పడి "నీవు నీ తప్పును ఇతరులనెత్తిన వేయందే సంతోషించవు" అన్నది.

బిందువాసిని కుర్రవాణ్ణి లేవతీయటానికి వెళ్ళి వంటి మీద చెయ్యివేసి చూసింది. ఒళ్ళంతా వేడిగావుంది. జ్వరం వచ్చింది. "ఈ కార్తీకమాసపు మంచులో రాత్రల్లా పడుంటే జ్వరంరాదా? తగ్గిపోతే బతికిపోతాను" అన్నది.

అన్నపూర్ణ తొందరపాటుతో వంగి "ఏది జ్వరం వచ్చిందా? చూద్దాం" అన్నది.

బిందువాసిని ఆమెచేయి తీసేసి "చాలు ఇక చూడ నవసరంలేదు" అని ఆమె నిద్రపోతున్న బిడ్డను మెల్లిగా ఎత్తుకుని అన్నపూర్ణమీద ఒక విషపుచూపు విసిరి తన గదిలోకి వెళ్ళిపోయింది.

అయిదారు రోజులలోనే అమూల్యుడికి స్వస్థత చిక్కింది. కాని బిందు అన్నపూర్ణ అపరాధాన్ని మాత్రం క్షమించలేదు. ఆరోజునుండి ఆమె అన్నపూర్ణతో సరిగా మాట్లాడటంకూడా లేదు.

అన్నపూర్ణ లోలోన అంతా గ్రహించికూడా మౌనం వహించింది. కాని బిందువాసిని అందరిముందూ తప్పంతా తన మీదే మోపుతున్న దురన్యాయాన్ని మాత్రం మరచిపోలేక పోయింది. ఒకరోజున ఏదో మాటలసందర్భంలో ఎలోకేసితో అనేసింది. "బిందుమూలానే వాడికి జ్వరంవచ్చింది. వాడి అదృష్టంకొద్దీ ఇంకా చావలేదు."

ఈ మాట బిందువాసిని దగ్గరకు మోసుకెళ్ళటానికి ఎలోకేసికి ఎంతో సేపు పట్టలేదు. బిందు శ్రద్ధగా విన్నదిగాని పైకేమీ మాట్లాడలేదు. ఆమె విన్నసంగతి కూడా ఎలోకేసికి తప్ప ఇంకెవరికీ తెలియదు. బిందు తోడికోడలితో మాట్లా

డటం బొత్తిగా మూనేసింది. కొన్ని రోజులనుండి వస్తువులన్నీ కొత్త ఇంట్లోకి జేరవేస్తున్నారు. రేపే కొత్తయింట్లో చేరేది, యాదవుడు పిల్లలతో ఆ ఇంట్లోనే ఉన్నాడు. మాధవుడు కూడా లేడు. ఏదో కేసుపనిమీద పొరుగూరు వెళ్ళాడు. ఈ సమయంలో యీ పాతయింటో ఒక పెద్ద సంఘటన జరిగింది. సాయంత్రం పిల్లాడికి పాఠం చెప్పటానికి పంతులుగారు వచ్చారు. బిందువాసిని ఆయనను పిలిచి "రేపటినుంచి మీరు ఆయింటో చెప్పండి పాఠం" అన్నది.

మాష్టరు "చిత్తం" అని వెళుతూవుండగా బిందు మళ్లా పిలచి "మీ శిష్యుని చదువు సంధ్యలెలా వున్నాయి?" అన్నది.

"చదువు సంధ్యల్లో అతడు మొదటినుంచీ మెరుగే ప్రతియేడూ ఫష్టున వస్తూంటే..." అన్నారు.

"వస్తున్నాడు. కాని ఇప్పుడు సిగరెట్లు కాలవటం నేర్చుకున్నాడు" అన్నది బిందు.

"సిగరెట్లు నేర్చుకున్నాడా?" మాష్టరు ఆశ్చర్యంతో అన్నాడు. మళ్ళీ అందుకుని "దీనిలో ఆశ్చర్యమేమీ లేదు. పిల్లలు వాణ్ణీ వాణ్ణీ చూచి అన్నీ నేర్చుకుంటారు" అన్నాడు.

"ఎవరినిచూచి నేర్చుకున్నాడు?" అని అడిగింది బిందు. మాష్టరు మాట్లాడలేదు. "ఈ సంగతి మీరు వారితో చెప్పండి" అన్నది బిందు.

పంతులుగారు తలతిప్పుతూ "అయిదారు రోజులైంది. బళ్ళోకి వెళ్లేదారిలో తోటవుంది. అంటుమామిడి పసిపిందె లన్నీ తుంచేసి కొమ్మలు విరిచేసి వాణ్ణిపట్టుకుతన్ని ఒక రణ

రంగంచేసి పోయ్యారట. ఈ సంగతి మా హెడ్‌మాష్టరు గారు చెప్పారు" అన్నాడు.

బిందు ప్రాణాలు బిగపట్టుకుని "ఆ తర్వాత ఏమి జరిగింది? అని అడిగింది.

"మాలి హెడ్‌మాష్టరు దగ్గరకెళ్ళి చెప్పాట్ట. ఆయన పిల్లలదగ్గర పది రూపాయలు జరిమానా వసూలుచేసి వాడి కిచ్చి శాంతపరచి పంపాడట."

బిందువాసిని యీ మాట నమ్మ లేక "మాఅబ్బాయి కూడా వున్నాడా! డబ్బెక్కడనుంచి తెచ్చాడు?" అన్నది.

"ఆ సంగతి నాకు తెలియదు కాని వారిలో అమూల్యుడు కూడా వున్నాడు. మీ నరేంద్రుడుకూడా వున్నాడు. ఇంకా నలుగురయిదుగురు అల్లరిపిల్లకాయలున్నారని హెడ్‌మాష్టరు చెబుతూ వుండగా విన్నాను" అన్నాడు పంతులు.

"డబ్బుకూడా వసూలయిందా?"

"ఆఁ. వసూలయిందనే విన్నాను."

"సరే, మీరిక వెళ్ళండి" బిందువాసిని అక్కడే కూలబడ్డది. "నాకు చెప్పకుండా వాడికి డబ్బిచ్చే సాహసం ఈ ఇంట్లో ఎవరికున్నది?" అని ఆమె నోట్లోంచి అస్పష్టంగా వచ్చింది. అసలు ఆమె మనస్సే బాగుండలేదు. దాని మీదట తోడికోడలితో మాటలులేవు. ఆపైన ఈ సంగతొచ్చి ఆమెను వెర్రులెత్తించింది. అన్నపూర్ణ దగ్గరకెళ్ళి "అక్కా! అమూల్యుడికి ఈ మధ్య మీరేమైనా డబ్బిచ్చారా?" అని అడిగింది

సరిగ్గా ఈ మాటే అడుగుతుందని అన్నపూర్ణ భయపడిపోయింది. "ఎవరు చెప్పారు?" మెల్లగా అడిగింది.

"అదికాదు నాకవసరమైంది. వాడు ఏమని పుచ్చు కున్నాడు. నీ వేమని యిచ్చావు-ఇదీ కావలసింది" అన్నది బిందు.

అన్నపూర్ణ డిగాలుపడిపోయింది.

"నేను వాణ్ణి అదుపులో పెట్టటం మీా కిష్టం లేదు. అందు కనే నా కీ సంగతి తెలియకుండా దాచి వుంచారు. వాడెన్ని పాడుపనులు చేసినా పెద్దలముందు అబద్ధాలు చెప్పడు. మీారు బుద్ధిపూర్వకంగానే యిచ్చారు, అవునా కాదా?" అన్నది బిందు.

"నిజమే, ఈ సారిమాత్రం వాణ్ణి క్షమించు బిందూ! నేను క్షమాపణ కోరుతున్నాను" అన్నది అన్నపూర్ణ మెల్లగా.

బిందువాసిని లోలోన కుమిలిపోతూ "ఒక్కసారా? ఒక్కసారి కేకాదు. ఎప్పటికీ క్షమించాను. ఇంకేం మాట్లాడను ప్రమేయం పెట్టుకోను. నా కళ్ళఎదుట ఇలా కొద్దికొద్దిగా చెడిపోవటం సహించలేను. ఇంతకంటే ఒకేసారి చెడిపోవటం మంచిది. కాని నీ కింతసాహసమా?" అన్నది.

చివరిమాట అన్నపూర్ణకు ఘాటుగా తగిలింది అయినా ఆమె మాట్లాడకుండా వుండిపోయింది. బిందు వాగుతున్నకొద్దీ ఆమె కోపంకూడా పెరుగుతూవుంది. "ప్రతి విషయంలోనూ మీారు నంగనాచిలాగ వుండి ఈ సారి క్షమించు! ఈ సారి క్షమించు, అంటూ వుంటారు. ఈ దోషమంతా మీాదికాని వాడిదికాదు. నిన్నుమాత్రం క్షమించను" అన్నది.

చాటునుండి ఇంటినౌకర్లు – చాకర్లు ఈ మాటలన్నీ వింటున్నారు.

అన్నపూర్ణ ఇక సహించలేక పోయింది. "ఏమిచేస్తా వేమిటి! ఉరితీయిస్తావా?" అన్నది.

నిప్పులో నేయిపడ్డట్టయింది. "అదే మీకు సరైన శిక్ష" అని బిందువాసిని తుపాకల్లే పేలింది.

"నా కొడుక్కి నేను రెండు రూపాయలిచ్చుకున్నాను, అదేగా నా తప్పు?"

మాటమీద మాటవచ్చి బిందు అసలుమాట మరచి పోయింది. "అయినా ఎందుకు ఇచ్చారు? పాడుచేయటానికి డబ్బెక్కడనుంచి వస్తుంది!" అన్నది.

"డబ్బు నువ్వు పాడుచేయడంలేదూ?" అన్నపూర్ణ అన్నది.

"నేను పాడుచేస్తే నాడబ్బు పాడుచేసుకుంటున్నాను. కాని మీ రెవరి డబ్బు పాడుచేసుకుంటున్నారో చెప్పండి!"

ఈ మాటకు అన్నపూర్ణకు వచ్చిన కోపంచూస్తే భయంవేస్తుంది. ఆమె పేదఇంటిబిడ్డ. బిందువాసిని ఎత్తిపొడుపు తన మీదేనని గ్రహించింది. చటుక్కున లేచినుంచుని "నువ్వు ధనవంతుల బిడ్డవని వప్పుకున్నాను, అందుకని ఇంకెవరూ తన బిడ్డకు రెండు రూపాయ లిచ్చుకోలేరని అహంకార పడకు" అన్నది.

"నాకేం అహంకారము లేదు. నువ్వు యిచ్చే ప్రతిపైసా ఎవరిదో ఆలోచించుకో" అన్నది బిందు.

"ఆపైసా ఎవరిదీ అనా? నీ నోటికొచ్చినట్లల్లా వాగుతావు. పో అవతలికి పో" అన్నది అన్నపూర్ణ.

"అవతలికి తెల్లవారగానే వెళతానులే. కాని ఎవరి డబ్బు ఖర్చు చేస్తున్నావో, ఎవరి ఆర్జనమీద బ్రతుకుతున్నావో అదికూడా తెలియదూ?" అనేసి బిందు సబ్బురాసై వుండి పోయింది.

"అన్నపూర్ణ మొహం వివర్ణమైంది. ఆమె నిమిషం సేపు తోడికోడలి మొహంకేసి తదేకదృష్టితో చూచి "మీ భర్త సంపాదనమీద బతుకుతున్నామని, నీకు దాసీనని, నౌకర్ననీ—అదేగా నీ అభిప్రాయం? అయితే ఇంతకాలంనుండి ఎందుకు చెప్పలేదు?" అన్నది.

చెబుతూవుండగా అన్నపూర్ణ పెదవులు వణికాయి. పెదవులు పళ్ళకింద నొక్కిపట్టి ఒకనిమిషంసేపు ఆగి "తమ్ముడి కోసం నీ బావగారు ఒక్కసారిగా రెండు బట్టలు కొనుక్కో జాలనప్పుడు నీ వెక్కడున్నావమ్మా తోడికోడలా? ఇల్లు తగులబడిపోగా చెట్టుకింద వండుకుతింటూ మళ్ళా ఇల్లు కట్టించినప్పుడు నీ వెక్కడికి వెళ్ళావమ్మా చెల్లీ?" అని అంటూ వుండగా కళ్ళనుండి జలజల రాలిన కన్నీటిని తుడుచుకుని మళ్ళా "నీ మనసులో మాట వారికి తెలిసివుంటే ఇలా నల్లమందు భాయిలాగ తూగుతూ తూగుతూ కాలంగడిపే మనిషి కాదు ఆయన. ఆ సంగతి మీ వారికి తెలుసు. ఆకాశంలో నున్న దేవతలకు తెలుసు. నన్ను అడ్డంపెట్టుకుని వారిని అవమాన పరుస్తావా?" అన్నది.

పతిమీదవుండే అభిమానంచేత అన్నపూర్ణ వక్షం ఉబికిపడటం మొదలెట్టింది "నీవు నీ ఉద్దేశం తెలపటం మంచిదే అయింది. దక్షుడు తనపతిని అవమానంచేయగా సతి

ఆత్మహత్య చేసుకుంది. నేను నీ తిండి తినేకంటే మరొకరింట వంటచేసుకు బతుకుతాను ఇదే వట్టు! నీవు వారిని అవమానం చేస్తావా ?" అన్నది.

సరిగ్గా అదేసమయంలో యాదవుడు వాకిట్లోకి వచ్చి-"వేయ్" అని భార్యను పిలిచాడు. పతిగొంతు వినేసరికల్లా ఆమె అభిమానం తుఫానుచే పొంగిన సముద్రంలా పొంగింది. గబగబా బైటికివచ్చి "ఛీ! ఛీ! ఆలు బిడ్డలను పోషించలేని మగవానికి ఉరిపోసుకు చావటానికి ఎక్కడా బారెడుతాడు దొరక్కపోయిందా ?" అన్నది.

యాదవునికేమీ తెలియలేదు. "ఏమిటి ?" అన్నాడు.

"ఏమిటా! ఏమీలేదు. నేను ఆవిడ దాసీనని మీరు నౌకరనీ మీ మరదలివ్వాళ స్పష్టంగా చెప్పేసింది."

ఇంట్లోవున్న బిందు నాలుక కొరుక్కుని చెవుల్లో వేళ్లు పెట్టుకుంది.

అన్నపూర్ణ యేడుస్తూ "చేయెత్తి ఎవరికీ ఒక దమ్మిడీ యిచ్చే అధికారం నాకులేదు. మీరు బ్రతికుండగానే నేనీ మాట వినాల్సి వచ్చింది. ఇప్పుడు మీ ఎదుటనిల్చుని శపథం చేస్తున్నాను. ఇవాళనుంచీ నేను వాళ్ళ అన్నంతింటే అనంతుని మీదవట్టు" అన్నది.

మూసుకున్న బిందు చెవులలో ఈ మాటలు స్పష్టంగా ప్రవేశించాయి. బిందువాసిని "ఎంత వట్టు పెట్టుకున్నావమ్మా అక్కా!" అని స్పష్టంగా అంటూ పన్నెండేళ్ళ తర్వాత మళ్ళా మూర్ఛవచ్చి విరుచుకు పడిపోయింది.

## ౭

కొత్త ఇంటిలోకి యాదవుడు, అన్నపూర్ణ, -అమూల్యా మినహా అందరూ వచ్చేశారు. పొరుగూళ్ళ నుంచి బిందు పినతల్లి, పినతల్లి కూతురూ, కన్నవారింటినుండి ఆమె తల్లి దండ్రులూ, నౌకర్లూ, చాకర్లూ, ఇంకా తక్కిన బంధువులు వచ్చారు. ఇల్లంతా జనంతో క్రిక్కిరిసి వుంది. ఇక్కడికి వచ్చిననాడు మాత్రం బిందు కొంచెం వుదాసీనంగా కనపడింది. కాని మరునాటినుండి బాగానేవుంది. కోపంచల్లాగగానే అన్నపూర్ణ వస్తుందని బిందుకు గట్టిగా నమ్మకముంది. ఇక్కడ పూజ చేసి సంతర్పణ చెయ్యాలి. బిందు ఆ ప్రయత్నంలో నిమగ్నమైవుంది.

"అమ్మాయి! నీ కొడుకు కనిపించటం లేదేం?" బిందు తండ్రి అడిగాడు.

"ఆ ఇంట్లో వున్నాడు" బిందు క్లుప్తంగా సమాధానం చెప్పింది.

"మీ తోడికోడలు ఇంకా రాలేదేం?" తల్లి అడిగింది.

"రాలేదు" అన్నది బిందు.

అప్పుడు ఆమె అన్నది "ఔను లే! అంతా వచ్చేస్తే ఆ ఇంట్లోవుండేదెవరు! తల్లిదండ్రులు సంపాయించిన యిల్లు మూసివుంచటంకూడా అంత మంచిది కాదు"

బిందు మాట్లాడకుండా తన పనిమీద వెళ్ళిపోయింది.

యాదవుడు రోజూ సాయంత్రంపూట ఒకసారి కొత్త ఇంటికి వచ్చి బైట కూచుని యోగక్షేమాలు తెలుసుకుని

వెళ్ళిపోతున్నాడు. లోపలమాత్రం అడుగు పెట్టటంలేదు. గృహ ప్రవేశానికి ఒకనాడు ముందు రాత్రి అతను లోపలికి కెళ్ళి ఏలోకేసిని పిలచి యోగక్షేమాలడిగాడు. బిందువాసిని చాటున నిలబడి అంతావిన్నది. బావగారు తనను తండ్రికంటే మిన్నగా ఆదరించారు. ఎప్పుడూ 'అమ్మా' అని పిలిచేవాడే గాని 'మరదలా' అనికూడా ఎరుగడు. తోడికోడలితో తగూ వచ్చినప్పుడు తను ఎన్నిసార్లో ఈ బావగారిదగ్గరకు వెళ్ళి ఫిర్యాదులు చేసింది. ఆయన వాటినెప్పుడూ తోసెయ్యలేదు. ఆయన ముందుకు వెళ్ళటానికి బిందుకు ఈ నాడు సిగ్గువేసింది. గొంతు పెగిలిరాలేదు. యాదవుడు వెళ్ళిపోయాడు. ఎక్కడ చూచినా జనం వుండటంవల్ల గదిలోకి వెళ్ళి ఏకాంతంగా నోట్లో పయటచెంగు పెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

మరునాడు వుదయం బిందు పతిని పిలిపించి "ప్రొద్దెక్కుతూవుంది, పురోహితుడు కూర్చుని వున్నాడు. బావగారింకా వచ్చినట్టు లేదే?" అన్నది.

"ఆయనెందుకు వస్తాడు?" మాధవుడు వింతగా అడిగాడు.

బిందు అతనికంటేకూడా ఎక్కువ వింతతో "ఆయనెందుకు వస్తారు! ఆయన రాకపోతే ఇదంతా ఎవరు చేస్తారు?" అన్నది.

"నేను చేస్తాను—లేకపోతే ప్రియబాబు బావ చేస్తాడు. అన్నయ్య రారు" అన్నాడు మాధవుడు.

బిందుకు కోపంవచ్చింది. "రాకంటే అయిపోయిందా పనింటికి? వారుండగా మరెవరికైనా అధికారముందా చెయ్య

టానికి ? అలా ఎప్పటికీ వీలులేదు. ఆయన్నితప్ప మరెవరినీ ఇందులో చెయిచేసుకోనివ్వను" అన్నది.

"అయితే పనులన్నీ ఆపెయ్యి. వారింట్లో లేరు. పని మీద వెళ్లారు" అన్నాడు మాధవుడు.

"ఇదంతా తోడికోడలుగారి పన్నుగడ, అయితే ఆవిడ కూడా రాదన్నమాట." అని బిందువాసిని కంట నీరుపెట్టు కొని వెళ్ళిపోయింది. ఆవిడకు పూజా, పునస్కారము, సంతర్పణా సర్వమూ వృథా అనిపించిన్నై. మూడు రోజులనుండి ఆమె ప్రతిక్షణమూ ఇదే ఆలోచిస్తూ వుంది. బావగారొస్తారు, అక్క వస్తుంది. అమూల్యుడు వస్తాడని-వారొస్తారనే ధైర్యం తోనే ఈ మూడురోజులనుంచీ పనిపాటలన్నీ ధైర్యంగా చేసుకోగలిగింది. ఈ సంగతి ఆమె అంతరాత్మకు తప్ప ఇంకెవరికీ తెలియదు. పతి అన్న యీ మాటలతో ఆమె ధైర్యమంతా ఎండమావులలా ఎగిరిపోయింది. దానితో ఈ ఉత్సవ సన్నాహమంతా ఆమె గుండెలకు బరువైపోయింది.

ఎలోకేసి వచ్చి "సామానుగది తాళంచెవి ఇటివ్వమ్మా మిఠాయి పట్టుకువచ్చారు" అన్నది.

బిందు విసుగుతో "అక్కడెక్కడైనా పెట్టమను, తర్వాత చూద్దాం!" అన్నది.

"ఎక్కడ పెట్టించనమ్మా! కాకులు పాడుచేస్తాయి."

"పాడుచెయ్యనీ అక్కడ పారేసి పొమ్మను" అన్నది బిందు.

పినతల్లివచ్చి "ఇవ్వాళ ఎన్ని బియ్యం పొయ్యాలో ఒకసారి చెప్పమ్మా!" అన్నది.

బిందువాసిని మొహం చిట్లించుకుని "ఎన్ని కావాలో నాకేం తెలుసు ? ఇంత వయస్సు వచ్చింది మీకు తెలియదూ !" అన్నది.

పినతల్లి ఆశ్చర్యపడి – "ఈవిడమాట వినండి ? ఎంత మందిని భోజనాలకు పిలచారో నాకేం తెలుసు" అన్నది.

బిందు కోపగించుకొని "అయితే పోయి ఆయనగారి నడుగు. ఇటువంటి పనుల్లో మా అక్కగారిని చూడాల్సింది. అమూల్యుడికి వడుగైనప్పుడు ఊరందరికీ భోజనాలిక్కడే. అప్పుడైనా ఆమె ఇదెంతకావాలి, అదెంతకావాలి, నువ్వీపని చూడు, ఆపని చూడమని నా కొక్క మాట చెప్పిందా ? ఈ ఇంట్లోవారందరూ కలిసినా ఆమె కాలిగోరుకు పోలరు" అని మరో గదిలోకి వెళ్ళిపోయింది.

ఇంతలో కదంబం వచ్చి "అమ్మా — అయ్యగారి పూజా వస్త్రాలు..." అన్నది, ఆమె మాట పూర్తికాక ముందే "మీరందరూ కలసి నన్ను విరుచుకు తినండి పో, నా యెదుటనుంచి" అని కసురుకుంది. కదంబం గాబరాపడి పారిపోయింది.

మరికొంత సేపటికి మాధవుడువచ్చి పిలుపు మీద పిలుపు పిలచి "ఎక్కడ ? వినపడటంలేదు ?" అన్నాడు.

బిందుదగ్గరకు వచ్చి "వినపడటంలేదు. నా చేతకాదు, నా చేతకాదు ! అయిందా !" అని ఝుంకరించింది.

మాధవుడు స్తంభించిపోయి ఆమెమొహం కేసి చూస్తూ వుండిపోయాడు.

"మీరు నన్నేంచేస్తారు! మెడకు ఉరిపోస్తారా? పొయ్యండి!" అని బిందు ఏడుస్తూ అక్కడనుంచి వెళ్ళిపోయింది.

ప్రొద్దెక్కుతూ వుంది. బిందువాసిని పనియేమీ లేక పోయినా ఆగదిలోంచి ఈ గదిలోకీ, ఈ గదిలోంచి ఆగదిలోకీ, వెళ్ళి ఇతరుల లోపాలు పట్టుకుని గందరగోళంచేయటం మొదలు పెట్టింది. ఎవరో తొందరలో దారిలో గిన్నెలు పెట్టారు. బిందు వాటిని ఒక్కతన్నుతన్ని వాటి నెక్కడ పెట్టాలో బోధించింది. ఎవరో బట్టలారవేశారు. గాలికి ఎగిరి ఆమె మొహాన పడ్డాయి. బిందు వాటిని చించి పారేసి వాటి నెలా ఆరగట్టాలో చెప్పింది. ఆమె కెదురుపడ్డ వాళ్ళందరూ భయంతో పక్కకు తప్పుకుని నిలబడిపోతున్నారు.

పాపం పురోహితుడు లోపలికి వెళ్ళి "చాలా ప్రొద్దెక్కుతూవుంది. ఇంకా ఏర్పాట్లేమీ కానట్టువుంది" అన్నాడు.

బిందువాసిని చాటున నిలబడి "కార్యంపట్ల అలస్యం కాకుండా వుంటుందా?" అని అతి కటువుగా సమాధానం చెప్పి అక్కడ ఒక పళ్ళెంవుంటే దాన్ని ఒక్క తన్నుతన్ని మరోగదిలోకి వెళ్ళి నిర్జీవిలాగా పడివుంది. పదినిముషాలకు ఆమెకు ఒక పరిచయ కంఠస్వరం వినపడగానే గబగబా లేచి నుంచుని తలుపుచాటునుండి చూచింది. అన్నపూర్ణ వరండాలో నిలబడివుంది.

బిందువాసిని దుఃఖాభిమానంతో యేడ్చి కళ్ళుతుడుచుకుని ముందుకువచ్చి చేతులు జోడించి "పది పదకొండు కావచ్చింది. ఇంకెంత శత్రుత్వమని భావిస్తావమ్మా! నువ్వు పుచ్చుకోమంటే విషంపుచ్చుకుంటాను. ఇంటికెళ్ళి ఒక

గిన్నెడు పంపు” అని తాళపుచెవుల గుత్తి ఆమె పాదాల ముందు పారేసి తన గదిలో కెళ్ళి తలుపు వేసుకొని దొర్లుతూ ఏడవటం మొదలుపెట్టింది.

అన్నపూర్ణ మెదలకుండా తాళపుచెవులగుత్తి తీసుకొని సామాను గదితలుపుతీసి అందులో ప్రవేశించింది.

మూడు ఝాములకు భోజనాలయినవి. రాకపోకలు తగ్గినవి. అయినా బిందువాసిని దేనికోసం తీరిక లేకుండా లోప లికీ బైటికీ తిరుగుతూవుందో తెలియదు.

భైరవుడు వచ్చి, “అబ్బాయిగారు స్కూలులో లేరని” చెప్పాడు.

బిందు అతనిమీద నిప్పులు కురిపిస్తూ “దౌర్భాగ్యుడా పిల్లలు రాత్రిపూట బడిలో వుంటారురా? నువ్వు కొత్తగా దిగావా! ఒకసారి ఆ ఇంటికివెళ్ళి చూచిరాక పోయావు?” అన్నది.

“వెళ్లానండీ! ఆ ఇంటోకూడా లేరు” అన్నాడు భైరవుడు.

“ఎక్కడ ఏ వెధవలతో బిళ్ళంగోడు ఆడుతున్నాడో ఇప్పుడు అతనికి భయమూ భక్తీ పోయినై. ఈసారి ఆ పాడు ఆటలో ఒక కన్ను ఎగిరిపోతే అన్నపూర్ణ కడుపు చల్లగా ఉంటుంది. నువ్వు పోయి, ఎక్కడ ఉన్నాడో వెతుక్కుతీసు కురా!

అన్నపూర్ణ సామానుగది గడపలోపల కూచుని ఇంట్లో పెద్ద ముత్తయిదువులతో మాట్లాడుతూ తోడికోడలి ఈ కరుకు మాటలు విన్నది.

భైరవుడొచ్చి "అబ్బాయిగారు ఇంటికొచ్చారు. గాని ఇక్కడికి రానన్నారు" అన్నాడు.

బిందు ఈ మాటనమ్మలేదు. "రానన్నాడురా? నేను రమ్మన్నానని చెప్పలా?" అన్నది.

భైరవుడు తలతిప్పి "ఆఁ చెప్పినా రాలేను" అన్నాడు

బిందు క్షణంసేపు మెదలకుండా ఉంది "ఇది వాడి తప్పుకాదు. తల్లిపోకడలే వాడి కబ్బాయి. ఇక ఆ తల్లికొడుకుల మొహం చూస్తేనట్టు" అన్నది.

రాత్రి చాల ప్రొద్దుపోయింది. అన్నపూర్ణ ఇంటికి వెళ్ళిపోవటానికి బైలుదేరింది. మాధవుడు స్వయంగా ఆమెను పంపించి రావటానికి లేచాడు. బిందు గబగబా వచ్చి భర్త నుద్దేశించి, భయంకర స్వరంతో "పంపించి రావటానికి బైలుదేరారుగాని, ఆమె ఇంతవరకు పచ్చినీళ్ళుకూడా మింగలేదు తెలుసా!" అన్నది.

"ఆ సంగతి తెలియవలసింది నీకు, నాకెలా తెలుస్తుంది. ఇక్కడ పనులన్నీ అభాసు అవుతూంటే నేనే వెళ్ళి తీసుకు వచ్చాను" అన్నాడు మాధవుడు.

"సరే. బాగానే ఉంది. అయితే మీరు కూడా వారి పక్షానే నన్నమాట" అన్నది బిందు.

మాధవుడు దీనికేమీ సమాధానం చెప్పక "ఇక జాగు చెయ్యక, పద వదినా" అన్నాడు వదినగారితో.

"పదండి" అని అన్నపూర్ణ రెండడుగులు ముందుకు వేయగానే బిందు గర్జించి "జాతి శతృత్వం! నోటికొచ్చినట్టు

పది కల్పించి చెప్పటం తర్వాత వట్టుపెట్టుకుంటే సరా! నాలుగు రాత్రిళ్లు, నాలుగు పగళ్లు బిడ్డ మొహం చూడనిచ్చింది కాదు. భగవంతుడు న్యాయం చేయకమానడు" అని నోట్లో గుడ్డపెట్టుకొని ఏడుపు నాపుకుని వంటింట్లోకెళ్ళి విసుచుకు పడిపోయింది. గల్లంతువిని అన్నపూర్ణ వెనక్కితిరిగి "ఏమిటో చూద్దాం పదండి" అన్నది.

"చూడనవసరంలేదు, పదండి" అన్నాడు మాధవుడు.

"పోట్లాటసంగతి ఇంతకాలంనుండి రహస్యంగా ఉంది గాని ఇప్పుడు బైటపడ్డది. మరునాడు ఇంటి ఆడంగులంతా ఒక చోటకూచున్న సమయంలో ఏలో కేసి "కోడళ్ళు పోట్లాడు కుంటే పోట్లాడుకున్నారు, కాని కుర్రాడికేం వచ్చింది. ఒక సారి చూసిపోతే ఏం? తల్లిలాంటివాడే కొడుకూను. చాల మంది పిల్లలను చూశాంగాని, ఇటువంటి విశ్వాసఘాతకుణ్ణి ఎక్కడా చూడలేదమ్మా!" అన్నది.

బిందు విసుగ్గా ఒకసారి ఆమెకేసి చూసి సిగ్గుతో ఏవ గింపుతో తలవంచుకున్నది. "నీకు పిల్లవాడేగా కావలసింది. మా నరేంద్రుణ్ణి తీసుకో, కావాలంటే ఇచ్చేస్తాను. చంపెయ్యి నరికెయ్యి ఏమైనా ఎదురు చెబుతాడా! అలాంటివాళ్లు నా కడుపునే పుట్టరు" అన్నది.

బిందు మాట్లాడకుండా కూచుంది. ఆమె తల్లి ఏలో కేసికి సమాధానం చెప్పింది. ఆమె ఏండ్లు వచ్చిన మనిషి. కలవారి ఆడపడుచు, కలవారి కోడలు. కాకలుతీరిన మనిషి. చిరునవ్వు నవ్వి "ఎట్లా మాట్లాడతారమ్మా! అమూల్యుడు దాని రక్తమాంసాలలో కలిసిపోయాడు. ఇక దాన్నిలా గందర

గోషం చెయ్యకండి. బిందూ, మీ కోపాలు రెండు రోజులవే గాఅమ్మా! ఇంతమాత్రానికే బిడ్డపరాయివాడై పోయాడా?"

బిందు మిలమిల లాడుతున్న కన్నీళ్ళతో తల్లి మొహం కేసి చూసి మెదలకుండా వూరుకుంది.

సాయంకాలం ఆమె కదంబాన్ని పిలిచి "అయితే కదంబం నువ్వుకూడా ఉన్నావుగదా, ఆమె అంత పట్టువేసు కునేంత నా తప్పేముంది చెప్పు? అని" అడిగింది.

దీన్ని గురించి ఆలోచించటానికి తనను పిలిచిందని కదంబానికి నమ్మకము లేక సంకోచంతో మౌనంగా వూరుకుంది. బిందు మళ్ళా అందుకుని, "ఏమైనాకానీ, మీరంతా వయసులో పెద్దవారు మీ అభిప్రాయం కూడా నేను వినాలి. నా వల్ల ఏమైనా తప్పుందేమో నువ్వే చెప్పు!" అన్నది.

కదంబం తలకాయ తిప్పి "ఇందులో మీ తప్పేముంది?" అనేసరికి, "అయితే ఆ ఇంటికెళ్ళి రెండు మాటలని రారాదు, నీకు భయమెందుకు?" అన్నది బిందు.

కదంబానికి వూతం చిక్కేటప్పటికి "భయమేమీ లేదు అమ్మగారూ! అయిపోవలసిందేమిటో అయిపోయె. ఇప్పుడు తగూ పెట్టుకునిమాత్రం లాభమేమిటి?" అన్నది.

"అలాకాదు కదంబం! నీకు తెలియకుగాని నిజం చెప్పెయ్యడం మంచిది. లేకపోతే నేనుంతా నాది. వారి దేమీ లేదనుకుంటాను. నిన్ను తరిమేస్తాను. గెంటేస్తాను అని ఆమె ఎన్నడూ అనలేదూ? ఇలాఅంటే నేనెప్పుడైనా కోప గించుకున్నానా? ఆమె చాటుగా డబ్బు ఎందుకు యివ్వాలి నా కెందుకు చెప్పక పోవాలి?" అన్నది బిందు.

"సరే, రేవు వెళతాను. ఇవ్వాళ చీకటి పడిపోయిరది" అన్నది కదంబం.

బిందువాసిని అసంతృప్తిపడి "అప్పుడే ఎక్కడ చీకటి పడింది కదంబం! నువ్వు చాలామాటలు నేర్చుకున్నావు. శీతాకాలం కాబట్టి ప్రొద్దుపోకినట్టు కనపడుతుంది. లేకపోతే ఎవరినైనా తోడు తీసుకుపోరాదు? ఒరే భైరవా! ఉళక్కని పిలువు. కదంబం వెంట వెళుతుంది" అన్నది.

"ఉళక్కతో అయ్యగారు లాంతర్లు తుడిపిస్తున్నారండి" అన్నాడు భైరవు. బిందు మిరిమిరి చూసి "వళ్లు పొగరు సమాధానం చెబుతావేం?" అన్నది.

భైరవుడు ఆమె మిరిమిరి చూపులకు పారిపోయాడు. కదంబాన్ని పంపి బిందు ఒకటి రెండుసార్లు ఆ గదిలోకీ ఈగదిలోకీ వెళ్ళి వంటగదికి వచ్చింది. వంటలక్క ఒక్కతే కూచుని వంట చేస్తూవుంది. బిందు ఒక మూలగా కూర్చుని "అయితే, నువ్వే సాక్ష్యమనుకుందాం. ఎవరిది తప్పో నిజం చెప్పు" అన్నది.

వంటలక్క తెలుసుకోలేక "ఏమి తప్పు అమ్మగారూ?" అన్నది.

"ఆ నాటి సంగతి! నేనేమన్నాను? అక్కా! 'ఈ మధ్య అమూల్యుడికి డబ్బు ఇచ్చావా' అనేగా నేన్నది. పిల్లలకు డబ్బిస్తారని ఎవరికి తెలియదు? 'ఏడ్చాడు, ఇచ్చాను' అంటే సరిపోయేదిగా. తగూ సమసిపోయేదిగా! ఈ గొడవలన్నీ వచ్చేవికాదుగా. అలాంటి పట్లు వేసుకోనవసరముండేది కాదుగా. పది గిన్నెలున్నచోట మోగుతూనే వుంటాయి.

కాని మనం మానవులం. దానికి ఇంతపట్టు వేసుకోవాలా ? ఇంట్లో ఒక్కగానొక్క బిడ్డ. వాడిమీద పట్టు! కాని నీతో చెబుతున్నాను వంటలక్కా! ఇక ఈ జన్మలో నేను ఆమె మొహం చూడను. శతృవునైనా కన్నెత్తి చూస్తానుగాని ఆమెను చూడను" అన్నది.

వంటలక్క స్వభావ సిద్ధంగానే మితభాషిణి. ఆమె ఏమి అనాలో తోచక మెదలకుండా వూరుకుంది. బిందు రెండు కళ్లూ నిండుకొచ్చాయి. వెంటనే కళ్లొత్తుకుచుకుని దుగ్ధ స్వరంలోనే "కోపంలో ఎవరు పట్లువేసుకోరు వంటలక్కా? అందుచేత మంచినీళ్లు కూడా ముట్టుకోగూడదూ ? పిల్లవాణ్ణి కూడా రానీయలేదు. ఇవన్నీ పిల్లచేష్టలా? లక్షకానీ, నేను చిన్నదాన్ని అనుభవం తక్కువ. ఆమె కన్నబిడ్డయితే ఏమి చేసేది! నేనుకూడా ఇక ఆమెవూసు ఎత్తను. మీరంతా చూస్తారుగా" అన్నది.

వంటలక్క ఈసారికూడా మాట్లాడలేదు. బిందు "ఆవిడకే మహా పట్టువేసుకోవడం తెలుసా! నాకు తెలియదా! నేనూ రేపాయింటికి వెళ్ళి నాకో గిన్నెడు విషం పంపకపోతే నీవు పెట్టుకున్న ఒట్టేనని పట్టుపెట్టుకు వస్తే ఏమౌతుంది! నేను ఈ రెణ్ణాళ్ళనుంచీ చూస్తూ వూరుకున్నాను. రేపువెళ్ళి ఒక ఒట్టయినా పెట్టుకువస్తా. లేకపోతే మాట్లాడకుండా విషం తాగి - అక్కయ్య పంపిందని నలుగురితో - చాటిస్తా. నలుగురూ ఆవిణ్ణి ఛీ! ఛీ! అంటారు. అప్పుడైనా లొంగివస్తుందో రాదో చూస్తా" అన్నది.

వంటలక్క భయపడింది. మెత్తగా "అలా అనకూడదండి అమ్మగారు. పోట్లాటలు వస్తూనే వుంటాయి. వారూ మిమ్మల్ని వదిలిపెట్టి వుండలేరు. అబ్బాయి నువ్వు లేకుండా అంతకంటే ఉండలేడు ఈ నాలుగురోజులనుంచీ ఎలా ఉంటు న్నాడో మా కందరికీ చాలా ఆశ్చర్యంగా వుంది" అని అన్నది.

"అదే అంటున్నాను వంటలక్కా. తప్పకుండా ఈవిడే వాణ్ణికొట్టి - బెదిరించి ఉంటుంది. నేను లేనిదే ఒక్కరాత్రి కూడా పండుకోలేడు. ఇప్పటికి అయిదు పగళ్లు, నాలుగు రాత్రిళ్ళు అయింది. ఇక ఆ ఆడదాని మొహం ఏమని చూడను! పగవారి మొహమైనా చూస్తాను గాని ఆ విడ మొహం ఈ జన్మలో చూడలేనని చెప్పేశాను" అన్నది బిందు తొందరగా.

వంటలక్క తన మనికట్టుమీద ఒక నల్లమచ్చ చూపి "ఇదిగో చూడమ్మా, ఇంకా ఆనాటిమచ్చ పోనేలేదు. ఆనాటి రాత్రి మీకు మూర్ఛవచ్చింది. ఆసంగతులన్నీ మీకు తెలియవు. అబ్బాయి ఎక్కడనుంచి వచ్చి మీ మీద పడ్డాడో తెలియదు. వారి ఏడుపు మీరు చూచినట్లయితే! చచ్చి పోవటమేమిటో వారికి తెలియదు కాదు - 'మా అమ్మ చని పోయింది! మా అమ్మ చనిపోయింది!" అని ఒకటే ఏడుపు. నన్ను నీళ్లు చల్లనిచ్చాడా, విసరనిచ్చాడా! నే నవతలకు లాగబోయేప్పటికి కరిచాడు. పెద్దమ్మగారు తీయబోయేప్పటికి ఆవిడను గక్కి, చీర పీలికలు చేసిపారేశాడు. మిమ్మల్ని వదలి

ఆయన్ని సర్దవలసి వచ్చింది. చివరికి నలుగురైదుగురు కలసి ఆయాన్ని అవతలికి తీసుకెళ్ళారు" అన్నది.

బిందు కొంతసేపు కన్నువాల్చకుండా ఆమె మాటలను మింగుతున్నదా అన్నట్లు వంటలక్క మొహంకేసి చూస్తూ వుండిపోయింది. తర్వాత నిట్టూర్చి మెల్లిగాలేచి గదిలోకి వెళ్ళి పండుకున్నది.

"నాలుగైదు రోజులతర్వాత, బిందు తల్లీ, తండ్రీ, బంధువులూ రేపు వెళతారనగా బిందు మూర్ఛనుండి, తెప్పరిల్లి మెదలకుండా మంచంమీద పడివుంది. కదంబం విసురుతూ ఉంది. దగ్గర ఇంకెవరూలేరు. బిందు సైగతో ఆమెను దగ్గరగా పిలచి "అక్కయ్య వచ్చిందా?" అన్నది మెల్లగా.

"లేదమ్మగారూ! మేమింతమందిమి ఇక్కడ వుండగా ఆమెగారిని కష్టపెట్టటమెందుకు?" అన్నది కదంబం.

బిందు కొంచెంసేపు వూరుకుని, "ఇదే మీలోవున్న దొబ్బిడాయి. అన్ని పనులలోనూ మీ తెలివితేటలు ఉపయోగిస్తారు. ఇలాగే చూస్తూ నన్ను ఏదో ఒకరోజున చంపేస్తారు. గృహప్రవేశం రోజునకూడా మీ రింటినిండా ఉన్నారుగాని ఆ వేళకుమనిషి ఇంట్లోలేకపోతే మీరేం చేయగలిగారు? మీ రెక్కడ? ఆవిడెక్కడ? మీ రందరూ కలిసినా ఆవిడ చిటికెన వేలుగోరికి సరిపోరు" అన్నది.

బిందు తల్లి గదిలోకివచ్చి "అల్లుడిగారి అంగీకారమైంది. నువ్వుకూడా కొన్నాళ్ళపాటు మాతో ఉండివద్దువుగాని రా" అన్నది.

బిందు తల్లి మొహంకేసి చూసి "నేను వెళ్ళటమూ వెళ్ళకపోవటమూ వారిష్టంమీద ఆధారపడి వుందా ఏమిటి? వారు వెళ్ళమనగానే బైలుదేరటానికి? నేను నా శత్రువు ఆజ్ఞ లేనిదే కదిలేదెలా?" అన్నది.

"నీ తోడికోడలిమాటా? ఇప్పుడామె అనుజ్ఞ తీసుకో నవసరంలేదు. మీరు విడిపోయి ఎప్పుడు వచ్చారో అప్పటి తోనే ఆవిడతో పని తీరిపోయింది. ఇప్పుడు మీవారి అనుజ్ఞ అయితే చాలు" అన్నది తల్లి.

బిందువాసిని తల ఆడించి "కాదు కాదు! అలా కాదమ్మా! ఆమె బ్రతికున్నంత వరకు ఎక్కడైనా వుండనీ సమస్తమూ ఆమే. ఎన్ని చెప్పినా ఆవిడ అనుజ్ఞ లేనిదే ఇల్లు కదలలేనమ్మా! లేకపోతే బావగారు నొచ్చుకుంటారు" అన్నది.

ఇంతలో ఏ్రోకేసి అక్కడికి వచ్చి సంగతంతా విని, "మంచిది, నే చెబుతున్నా, నువ్వు వెళ్ళు" అన్నది.

బిందు ఆమె మాటకు ప్రత్యుత్తరంకూడా యివ్వలేదు. "అయితే మనిషి నెవరినైనా పంపి ఆమె అనుజ్ఞ తీసుకో రాదా?" అన్నది తల్లి.

బిందు ఆశ్చర్యపడి "మనిషి నెవరినైనా పంపా? అది మరీ బాగుండదమ్మా? నా కావిడమనస్సు తెలుసు. పైకి వెళ్ళ మంటుంది, కాని లోపల్లోపల కోపం పెంచుకుంటుంది. లేక పోతే బావగారికి నాలుగు కల్పించయినా చెబుతుంది. వద్దమ్మా మీరు వెళ్ళండి. నాకు రావటం పడదు" అన్నది.

బిందుతల్లి మరీ పట్టుపట్టలేదు. ఎవరి ఇష్టకు వారు వెళ్ళిపోయారు. ఇప్పుడా శూన్యగృహము ఆమెను మింగ జూస్తున్నది. కిందంతస్తులో ఒక భాగంలో ఏలోకేసి ఉంటు న్నది. పై అంతస్తులో తన గది. మిగతా మేడంతా బావురు మంటూ ఖాళీగా వుంది. బిందు అన్యమనస్కురాలై అటూ ఇటూ తిరుగుతూ మూడో అంతస్తులో కెళ్ళి ఒక గది తెరిచింది. ఎప్పుడో భవిష్యత్ కాలంలో ఈ కొడుకూ, కోడలూ వుంటా రని ఉద్దేశించి ఈ అంతస్తు కట్టించింది ఆమె.

అక్కడికి రాగానే ఆమెకు కన్నీరాగలేదు. ఇక అక్కడ ఉండలేక కిందికి దిగి వస్తుండేప్పటికి మాధవుడు ఎదురు పడ్డాడు. "ఏమండీ! ఇప్పుడేం చెయ్యాలి?" అనేసింది ఆమె. మాధవుడు తెలుసుకోలేక "దేనిని గురించి?" అన్నాడు.

బిందు మరి సమాధానం చెప్పలేక హఠాత్తుగా నిట్టూర్చి "మరేం లేదులెండి" అన్నది.

మరునాడు ఉదయాన మాధవుడు బైట గదిలో కూర్చుని పని చేసుకుంటున్నాడు. బిందు వాసిని హఠాత్తుగా అక్కడికి వచ్చి "బావగారు నౌకరీ చేస్తున్నారా?" అని అడిగింది.

మాధవుడు తల ఎత్తకుండానే "అవును" అన్నాడు.

"అవునేమిటి? ఇది వారు నౌకరీ చేయతగ్గ వయస్సా!"

మాధవుడు యథావిధిగానే కాగితంమీద దృష్టిని గిడ్చి "మనుషులు వయసునుబట్టి చేస్తారా ఏమిటి ఉద్యోగాలు? తిండికి లేక అవసరాన్నిబట్టి చేస్తారుగాని!" అన్నాడు.

"వారికి తిండి ఎందుకు లేదు! మే మిద్దరం పరాయి వాళ్ళము, పోట్లాడుకుంటాము. కాని మీరు అన్నగారేగా?"

"సవతితల్లి బిడ్డలం, జ్ఞాతులం."

బిందు విసుపోయింది. "మీరు బ్రతికుండగా వారిచేత నౌకరీ చేయిస్తారా?" అన్నది మెల్లిగా.

మాధవుడు ఒకసారి తలపైకెత్తి తన భార్యకేసి చూసి స్వాభావికంగా, శాంతంగా "ఎందుకు చెయ్యనియ్యను! ఈ లోకంలో ఎవరి అదృష్టంకొద్దీ వారు పుడతారు, ఎవరి అదృష్టంకొద్దీ వారు అనుభవిస్తారు. దీనికి ప్రబల దృష్టాంతం నేనే. తల్లిదండ్రులెప్పుడు పోయారో నే నెరుగను. వదిన గారి నోటివెంట మాత్రం విన్నాను, మనం చాల పేదవాళ్ళ మని. కాని ఏనాడూ దుఃఖఛాయలుగాని, కష్టాలుగాని, నన్నంటలేదు. తెల్లని బట్టలు ఎక్కడనుంచి వచ్చాయో, కాలేజీఫీజు, పుస్తకాలకు డబ్బు ఎక్కడనుంచి తెచ్చి చెల్లించారో కూడా తెలియదు. అటుపైని 'వకీలు' నయ్యాను. డబ్బుకూడా ఎక్కువ సంపాదించలేదు. ఇంతలో నీ వెక్కడినుంచో ఇంత డబ్బు మూటకట్టుకుని ఈ ఇంట్లోకి వచ్చావు. పెద్దమేడకూడా వెలిసింది—కాని అన్నగారి సంగతి ఆలోచించు. ఎప్పుడూ ఎము కలువిరిగేట్టు కష్టపడతారు. పాతబట్టలుతప్ప కట్టరు. చలికాలములో కూడా ఆయన వంటిమీద చొక్కావుండగా ఎప్పుడూ చూడలేదు. ఒక్కపూట గుప్పెడు మెతుకులుతిని కేవలం మన కోసం. ఈ సంగతులన్నీ నాకేం జ్ఞాపకం లేవు. జ్ఞాపకం చేసుకునే అవసరంకూడా కనపడటంలేదు. కొన్నాళ్ళు మాత్రం సుఖంగా కాలక్షేపం చేశాడు. అందుకోసం భగవంతుడు వడ్డీ

తో సహా కట్టిపుచ్చుకుంటున్నాడు" అని అతను ఏదో అవసర మైన కాగితం కోసం వెళ్లకసాగాడు.

బిందు స్తంభించిపోయింది. నోటమాట పెగలలేదు. ఈ కథాకలాపాన్ని గురించి మగని మనసులో తిరస్కార భావం ఎంతగా అణగివున్నదో ఆ సంగతి బిందువాసిని ప్రతి రక్తపుబిందువూ యిప్పుడే తెలుసుకోవటం మొదలెట్టింది. ఆమె తలవంచుకుని నిలబడ్డది.

మాధవుడు కాగితాలు వెతుక్కుంటూ తనలో తాను "ఉద్యోగంటూ బలే ఉద్యోగం. రాధాపురపు ఠాణాకు రానూ, పోనూ అయిదుకోసుల దూరం. తెల్లవారగట్ల నాలుగు గంటలకే లేచిపోవటం, పగలల్లా తిండీ తిప్పలూ లేకుండా పనిచేసి రాత్రికి ఇంటికివచ్చి రెండు మెతుకులు తినటం —— జీతంకూడా ఎంత? పన్నెండు రూపాయలు!" అన్నాడు.

బిందు కంపించిపోయింది. "పగలల్లా తిండిలేదా? నెల మొత్తంమీద పన్నెండు రూపాయలా జీతం!" అన్నది.

"అవును పన్నెండు రూపాయలు. పెద్దతన మొచ్చింది. నల్లమందు వేసుకుంటాడు. కాసిని పాలయినా దొరకవు. భగవంతునికి ఆయనమీద దయ కలిగినట్టుంది. ఇక కొద్దిరోజుల్లోనే ఆయన కష్టాలు గట్టెక్కిస్తా డనుకుంటా."

బిందు కళ్ళవెంట బొటబొట కన్నీరు కారింది. ఆమె ఎన్నడూ చేయనిపని చేసింది. చప్పున భర్త పాదాలమీదపడి ఏడుస్తూ "మీ పాదాలట్టుకుంటాను. ఏదైనా ఏర్పాటు

చెయ్యండి. బలహీనంగా వున్నారు. ఇలావుంటే రెణ్ణాళ్లుకూడా బ్రతకరు'' అన్నది.

మాధవుడు ఏదో విధంగా కన్నీటిని తుడుచుకొని "నేనేం ఏర్పాటు చెయ్యను? వదిన మన సంపత్తి చిల్లిగానీ ముట్టదు. ఇక ఆయన కష్టపడకపోతే వారి సంసారం ఎలా గడుస్తుంది?'' అన్నాడు.

"అదేం నాకు తెలియదు. మీరు నాకు దైవము. వారు మీ కంటే ఎక్కువ. మనసులో తలచటానికికూడా వీలులేని మాట..." అంటూవుండగానే ఆమె గొంతు నిండు కొచ్చింది.

"మంచిదే కాని నువ్వు వదినగారి దగ్గరకైనా వెళ్ళు ఆమె కోపం చల్లారి, ప్రసన్నురాలయ్యేట్టు చూడు. ప్రొద్దు గూకులూ నా కాళ్ళుపట్టుకుని కూచున్నా నీకేమీ దారి దొరకదు" అన్నాడు.

బిందు వెంటనే కాళ్లొదిలి లేచి నిలబడి "కాళ్ళట్టుకునే అలవాటు నాకు లేదు. ఆరోజురాత్రి ఆవిడ మనింటివద్ద మంచి నీళ్ళయినా ఎందుకు తాగలేదో—ఆ సంగతంతా తెలిసుండి కూడా పగవారిలాగ ఎందుకు వూరుకున్నారో నా కిప్పుడు తెలిసివచ్చింది. నా తప్పును పెంచటానికా మీరు చెప్పకుండా వూరుకుంది!"

మాధవుడు కాగితంమీదే దృష్టివుంచి "నేనా విద్య మా అన్నగారివద్ద నేర్చుకున్నాను. అలా వుండగానే ఒక నాడు దాటిపొయ్యేట్టుగా భగవంతుడు నన్ను కరుణించాలి" అన్నాడు.

బిందు మరి మాట్లాడలేదు. గదిలోకెళ్ళి తలుపేసుని పడుకుంది.

మాధవుడు లేవబోతూ వుండేప్పటికి బిందు మళ్లా అక్కడికి వచ్చింది. ఆమె కళ్లు ఎర్రగా చింతనిప్పుల్లాగ ఉన్నాయి. మాధవుడికి దయకలిగింది. "ఒకసారి అక్కడికి వెళ్ళిరా. వారి ఎదుట నిల్చోచ్చు, అన్నీ చక్కబడతాయ్" అన్నాడు.

బిందు అత్యంత కరుణస్వరంతో "మీరు వెళ్ళండి. వెళ్ళకపోతే అమూల్యుడిమీద వట్టు" అన్నది.

మాధవుడు ఆమె ఉద్దేశ్యం గ్రహించి కొంచెం కాకపడి "నువ్వు వెయ్యివొట్లు వేసుకున్నా నేను పోయి అన్నగారితో చెప్పలేను. ఆయన స్వయంగా నన్నడిగితేనే తప్ప నా మెడ తెగుతున్నాసరే ముందుగావెళ్ళి చెప్పే సాహసం నాకు లేదు" అన్నాడు.

బిందు అక్కడనుంచి కదలలేదు.

"నువ్వు వెళ్ళలేవా ?" మాధవుడడిగాడు.

బిందు "లేదు" అని జవాబుచెప్పి మెల్లగా అక్కడనుంచి వెళ్ళిపోయింది.

౮

మేడ ముందునుంచే బళ్ళోకి వెళ్లేదారి. మొట్టమొదట కొన్నాళ్ళు గొడుగు అడ్డంపెట్టుకుని ఆ దారినే వెళ్ళేవాడు అమూల్యుడు. రెన్నాళ్ళనుంచి ఆ ఎర్రగొడుగీ దారిన వెళ్ళటం లేదు. చూచి చూచి బిందు కళ్ళు కాయలు కాస్తున్నాయి. అయినా ఆమె మేడమెట్లమీది గదిచాటున కూచుని అలాగే

చూస్తూవుంది. ప్రొద్దున తొమ్మిది పదిగంటలలోపున ఎన్నో రకాల గొడుగులు వేసుకుని ఎందరో పిల్లలు ఆ దారినే వెళ్లారు. బడి విడిచిపెట్టాక ఎందరో ఆ దారినే వచ్చారు. కాని ఆ నడకగానీ, ఆ గొడుగుగాని బిందుకు కనబడలేదు. ఆమె సాయంకాలానికి కళ్లు తుడుచుకుంటూ కిందకు దిగి నరేంద్రుని చాటుగా పిలచి "ఏంరా నరేన్, స్కూలుకు పోవటానికి తిన్ననిదారి ఇదే కదూ, మరి వాడు కనపడడేం ?" అని అడిగింది.

నరేంద్రుడు మాట్లాడలేదు.

"నరేగాని మీరిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ ఈదారినే వెళితే బాగుంటుంది - బాగుండదూ ?"

నరేంద్రుడు నిజంగా అమూల్యుణ్ణి ప్రేమిస్తాడు. అందు కని మెల్లగా, "వాడీ దారిన రావటాని సిగ్గుపడుతున్నాడు అత్తా ! అట్టాఅట్టా చుట్టూతిరిగి వస్తాడు" అన్నాడు.

బిందు కష్టంమీద నవ్వి "సిగ్గెందుకు ? ఈ దారినే రమ్మనమని చెప్పు" అన్నది.

నరేంద్రుడు తలతిప్పి "ఇక వాడు ఈ దారిన రాకేం ? ఎందుకురాడో తెలుసా ?" అన్నాడు.

బిందు కుతూహలంతో "ఎందుకని ?" అన్నది.

"నీకు కోపంరాదూ ?"

"రాదు."

"ఈ మాట వాళ్ళింటివద్ద తెలిస్తే ?"

"తెలియనియ్యనుగా."

"మా అమ్మకూడా చెప్పవుగా!"

బిందు ఇక ఆలస్యం సహించలేక "ఎవరికీ తెలియనివ్వనురా!" అన్నది.

నరేంద్రుడు మెల్లగా "మూఢోపంతు లున్నాడే ఆయన అమూల్యుని చెవులు బాగా మెలేశాడు" అన్నాడు.

బిందు ఒక్కసారి మండిపడి "ఎందుకు మెలేశాడు? వాడి వంటిమీద చెయ్యివెయ్యొద్దని నేను చెప్పలా?" అన్నది.

నరేంద్రుడు చేతులు తిప్పుతూ "ఆయన తప్పేముంది అత్తా! కొత్తవాడు. మన నౌకరు ఉళక్కిగాడున్నాడే ఆ ఆ పుండాకోరే, వాడొచ్చి మా అమ్మకు చెప్పాడు. మా అమ్మకూడా తక్కువేమీ కాదు. అది మూఢో పంతులుగారికి కబురంపింది. ఆపళంగా పంతులుఆ ఆసరా చూచుకొని వాడి చెవులు మెలిపెట్టాడు, ఎట్టా మెలిపెట్టా డనుకున్నావు అత్తయ్యా! ఇలా ట్టుపకుని......" అన్నాడు.

బిందు అక్కడికి ఆపింది "సరేగాని ఉళక్కిగాడికి ఏమని చెప్పాడు?" అని అడిగింది.

"ఉళక్కిగాడు నాకు బళ్ళోకి టిఫిన్ తెచ్చిపెడతాడుగా! మొన్నవాడు అలాగే తెచ్చేప్పటికి అమూల్యుడు పరుగెత్తుకువచ్చి 'ఏమిటి చూపు' అని అడిగాడు. ఉళక్కిగాడీ సంగతి మా అమ్మకు చెప్పాడు. అమ్మ 'వాడికి చూపకు. దిష్టితగులుతుంది' అన్నది" అని అన్నాడు.

"అమూల్యుడికి ఎవరూ టిఫిన్ తీసుకురావటంలా?" అని అడిగింది బిందు.

నరేంద్రుడు తల మొత్తుకొని "ఎక్కడినుండి వస్తుందత్తా? పాపం వాళ్లు పేదవాళ్లు. వాడు కాసిని అటుకులు జేబులో పోసుకువచ్చి చెట్లచాటుకుపోయి, అక్కడ కూచుని తింటాడు" అన్నాడు.

బిందువాసిని కళ్లముందు ఈ ఇల్లూ-వాకిలీ, ఈ ప్రపంచమంతా గిర్రున తిరుగసాగింది. ఆమె అక్కడే కూలబడిపోయింది. "సరే, ఇక నువ్వు పో నరేంద్ర్" అన్నది.

ఆరాత్రి ఎన్నిసార్లో పిలిచాక బిందువచ్చి పళ్లెంముందు కూర్చుంది. కాని ముద్దమాత్రం నోట్లో పెట్టలేకపోయింది. చివరికి "వంట్లో బాగాలేదు" అని లేచిపోయింది. ఆ మరునాడు కూడా దాదాపు వస్తే. ఎవరితోనూ ఏమీ మాట్లాడలేదు. ఏ ఉపాయమూకూడా దొరకలేదు. తను ఏ మాటాడితే తప్పు ఎక్కువౌతుందోనని భయపడ సాగింది. మూడవజామున భర్త భోజనం చేసేటప్పుడు అలవాటు చొప్పున దగ్గరే కూర్చుంది. కాని ముఖం అటు తిప్పుకుంది. నిన్నటినుంచీ ఆమెకు తినుబండారాలను చూడటానికి ఇష్టం తప్పింది.

ఇంట్లో దీపం వెలుగుతూవుంది. మాధవుడు కళ్లుమూసుకుని మెదలకుండా పండుకున్నాడు. బిందు కాళ్ళదగ్గరకు వచ్చి కూర్చుంది. మాధవుడు కన్నెత్తిచూచి "ఏమిటి?" అన్నాడు.

బిందు తలవంచుకుని కాలిగోరు ఆడించటం మొదలుపెట్టింది.

మాధవుడామె మనస్సు కనిపెట్టి జాలిపడి "నాకు నీ మనసు తెలుసు. కాని నా దగ్గర ఏడిస్తే ఏమిలాభం? ఆమె దగ్గరకు వెళ్లు" అన్నాడు.

బిందు నిజంగానే ఏడుస్తూ "మీరు వెళ్ళండి" అన్నది.

"నేను నీ తరఫున వెళ్ళి చెబితే, అన్నయ్య వినడు!"

"నే నోట్లేసుకుంటా, నాదే తప్పు. క్షమాపణ చెప్పుకుంటా. మీరు వెళ్ళి చెప్పండి."

"నావల్ల కాదు" అని మాధవుడు పక్కకు తిరిగి పండుకున్నాడు.

బిందు కొంచెంసేపు ఆశపెట్టుకు కూర్చున్నది. కాని మాధవుడు ఏమీ మాట్లాడక పోయేప్పటికి మెల్లగా లేచి వెళ్ళిపోయింది. మగని వ్యవహారంచూచి ఆమెకు చాల కష్టం కలిగింది. అది ఒక యోజనం పొడుగు పర్వతముల్లే ఆమె హృదయంలో ఆ మూలనుంచి ఈ మూలదాకా ఒక చిటికెలో వ్యాపించింది. తన నందరూ పరిత్యాగం చేశారని ఆమెకిప్పుడు నిశ్చయంగా తెలిసిపోయింది.

మర్నాడు ప్రొద్దున్నే యాదవుడు బిందువాసిని తండ్రికి జబ్బుగా ఉన్నదనిన్నీ, ఆమెను వెంటనే పుట్టింటికి పంపమనిన్నీ తమ్ముడికి ఒక ఉత్తరంరాసి పంపాడు. బిందు కంట నీరుపెట్టుకుంటూ బండి ఎక్కింది. పంపవచ్చిన వంటలక్క "తండ్రిగారికి వీలుచిక్కగానే త్వరగా రా అమ్మా!" అన్నది.

బిందు బండిదిగి ఆమెకు దణ్ణంపెట్టింది. ఇది చూచి వంటలక్క చాల చిన్నబోయింది. బిందు ఇలా నమ్రంగా వంగి

నమస్కరించటం ఇదివరకెన్నడూ ఎవరూ చూడలేదు. "నువ్వు ఎలాగైనా బ్రాహ్మణ బిడ్డవు. వయసున పెద్దదానవు మళ్ళీ తిరిగి రానవసరం లేకుండా, ఇదే కడసారి పయనమయ్యేటట్టు ఆశీర్వదించు" అన్నది.

వంటలక్క అందుకేమీ సమాధానం చెప్పలేక వాడిన బిందు మొహంకేసి చూసి భావురుమన్నది.

ఏలోకేసి దగ్గరేవుంది. "ఇదేమిటమ్మా! లోకంలో ఎవరి తండ్రికి జబ్బుచేయటంలేదు?" అని అన్నది.

బిందు ఏమీ సమాధానం చెప్పక మొహం తిప్పుకుని కళ్లు తుడుచుకుంది. కొంచెంసేపాగి — "మీకుకూడా నమస్కారాలు వదినా! వెళ్ళొస్తాను" అన్నది.

"వెళ్ళిరావమ్మా! నేను ఇంట్లో అన్నీ సంభాళించుకుంటూ వుంటాను."

బిందు ఇంకేం మాట్లాడక బండెక్కింది. బండివాడు గుర్రాన్ని అదిలించాడు.

* * * * *

వంటలక్క ఈ సంగతంతా అన్నపూర్ణకు చెప్పింది. ఆమె విని వూరుకుంది. ఇంతకు ముందెప్పుడూ బిందు అమూల్యుని విడిచిపెట్టి పుట్టింటికెళ్ళలేదు. వాడి మొహం చూచి కూడా ఇప్పటికి నెలరోజులపైన అయింది. అన్నపూర్ణ ఆమె దుఃఖాన్ని గ్రహించింది.

రాత్రి తండ్రిదగ్గర పండుకొని అమూల్యుడు ఆ మాట ఈ మాటా చెబుతున్నాడు. అన్నపూర్ణ దీపపు వెలుగున

గంత కట్టుతున్నదల్లా హఠాత్తుగా నిట్టూర్చి "అయ్యో! ఈ వెళ్ళటమే కడసారి వెళ్ళటము అనుకుంటిట. అమ్మవారు చల్లగానూచి మా అమ్మను మా ఇంటికి తిన్నగా చేర్చాలి" అనుకుంది.

ఈ మాటలువిని యాదవుడు దిగ్గునలేచి కూర్చుని "నువ్వు మొదటినుంచీ సరిగా చేశావుకావు. మా అమ్మను మీ రెవరూ గుర్తించలేదు" అన్నాడు.

"అదికాదా 'అక్కయ్యా!' అని ఒక్కసారి ఇక్కడికి వచ్చింది కాదు తన బిడ్డను బలవంతంగా తీసుకుపోవచ్చు. అలాగూ చెయ్యలేదు. ఆనాడు ప్రొద్దుగూకులగా పని చేసి చేసి తిరిగొస్తుంటే ఎన్నిమాటలన్నది?" అన్నది అన్నపూర్ణ.

"మా అమ్మసంగతి నా కొక్కడికే తెలుసు. ఇంత వయసు వచ్చినా క్షమించలేకపోతే పెద్దదానివై ఎందుకు? నీ వెలాంటి దానవో మాధవుడూ అలాంటివాడే. మీఇద్దరూ కలిసి మా అమ్మ ప్రాణాలు బంధించి వధచేసి పారేశారు" అన్నాడు యాదవుడు.

అన్నపూర్ణ కళ్ళవెంట జలజలా నీళ్లు రాలినై.

"నాన్నా! అమ్మరానని ఎందుకు చెప్పిపోయింది?" అడిగాడు అమూల్యుడు.

అన్నపూర్ణ కళ్ళు తుడుచుకుని "మీ అమ్మదగ్గరకు వెళతావా!" అన్నది.

అమూల్యుడు తలతిప్పి "వెళ్ళను" అన్నాడు.

"ఎందుకు వెళ్ళావురా ? మీ అమ్మ తాతయ్యగారింటికి వెళ్ళింది. నువ్వు కూడా రేపు వెళ్ళు" అన్నది అన్నపూర్ణ.

అమూల్యుడు మాటాడలేదు.

"వెళతావురా అమూల్యా ?" అని అడిగాడు యాదవుడు.

అమూల్యుడు మొహం దిండులో కప్పిపెట్టుకుని మొదటలాగానే తలతిప్పుతూ "వెళ్ళను" అన్నాడు.

కొంచెం ప్రొద్దువుండగానే యాదవుడు తన పనికి వెళ్ళటానికి తయారౌతూవుంటాడు. అయిదారు రోజుల తర్వాత సంగతి. మామూలుగా కచేరీకి వెళ్ళటానికి తయారై చుట్ట కాలుస్తున్నాడు. "వేళ కావస్తున్నది" అన్నది అన్నపూర్ణ.

యాదవుడు తొట్రుపడి చుట్ట అవతల పారేసి "ఇవ్వాళ నా మనస్సేమీ బాగాలేదు. రాత్రి మా అమ్మవచ్చి తలుపు చాటుగా నుంచున్నట్టు కల వచ్చింది. రామా !" అనుకుంటూ కచేరీకి వెళ్లాడు.

ప్రొద్దున అన్నపూర్ణ నాలుగుభాగంతో వంటపని చేసుకుంటూవుండగా మేడలోంచి నౌకరు వచ్చి "చిన్నమ్మగారికి చాల జబ్బుగా ఉందట. మరిదిగారు చూట్టానికి వెళ్ళారు" అని చెప్పాడు.

అన్నపూర్ణ వెళుతూ తనపతి అన్నమాటలు గుర్తుకు వచ్చి కంపించిపోయింది. "ఏమి జబ్బురా ?" అని అడిగింది.

"ఆ సంగతి తెలియదమ్మా ! మాటమాటకీ మూర్ఛ వస్తుందనీ, జబ్బు పెద్దదేననీ విన్నాను" అన్నాడు నౌకరు.

యాదవుడు సాయంత్రానికి ఇంటికివచ్చి ఈ కబురువిని శాపుకున్నాడు. "ఎంత సంబరపడి బంగారు ప్రతిమను తెచ్చుకున్నానో తెలుసా? ఆ ప్రతిమను నట్టేట్లో వదిలేస్తున్నావా? నే నిప్పుడే వెళతాను" అన్నాడు.

దుఃఖభారంతో అన్నపూర్ణ గుండె బ్రద్దలౌతూ వుంది. ఆమెకు అమూల్యునిమీదకంటే బిందువాసినియందు ఎక్కువ ప్రేమ. అన్నపూర్ణ కళ్ళు తుడుచుకుని మగనికి నీళ్ళిచ్చి సంధ్యావందనం చేసుకోటానికి బలవంతంగా కూచోబెట్టి వరండాలోనికివెళ్ళి చీకట్లో కూలబడ్డది. కొంతసేపటికి వాకిట్లో మాధవునిమాట వినపడ్డది. అన్నపూర్ణ అతికష్టంగా ప్రాణాలు బిగపట్టుకుని చెవులలో వేళ్ళుగట్టిగా కుక్కుకుని రాయల్లే కూచుంది.

మాధవుడు వంటిల్లంతా చీకటిగా ఉండటంచూచి, ఇటువైపు గదిలోకివస్తూ చీకట్లో అన్నపూర్ణ కూర్చుని వుండటం చూచి శుష్కస్వరంతో బహుశా వినేవుంటావు" అన్నాడు.

అన్నపూర్ణ ముఖమెత్తలేకపోయింది.

"అమూల్యుడు వెళ్ళటం చాలా అవసరం. కాలం ముంచుకొస్తున్నట్టుంది" అన్నాడు మాధవుడు.

అన్నపూర్ణ కిందపడి ఏడ్వసాగింది. యాదవుడు పిచ్చివాడల్లే ఆ గదిలోకి పరుగెత్తుకువచ్చి "అలా ఎప్పటికీ జరగదు మధూ! నేను చెబుతున్నానుగా, ఎప్పటికీ జరగదు. నేను తెలిసిగాని, తెలియకగాని ఎవరికీ కష్టం కలిగించలేదు. భగవంతుడీ వయసులో నాకిటువంటి శిక్ష ఎన్నడూ విధించడు" అన్నాడు.

మాధవుడు మాట్లాడలేదు. "సంగతులన్నీ నాకు విప్పి చెప్పు. నేను వెళ్ళి మా అమ్మను తీసుకొస్తాను. నువ్వేమీ ఆతురత పడకొద్దు మాధవ్! [illegible] న్నాడు యాదవుడు.



"నేనేం ఆతురత పడటంలేదు. మీరే ఆతురత పడుతున్నారు" అన్నాడు మాధవుడు.

"నేనేం ఆతురత పడటంలేదు. ఇదుగో తే, లేరా అమూల్యా!" అని యాదవుడు అంటూవుండగా మాధవుడు అడ్డుతగిలి, "తెల్లవారే నిద్ర రాదూ!" అన్నాడు

"కాదు కాదు. అలా వీలులేదు. నువ్వేం గాభరా పడకు మధూ! బండిని పిలు, లేకపోతే నడిచే వెళతా."

మాధవుడు ఇంకేం మాట్లాడకుండా బండి తీసుకురావటానికి వెళ్లాడు. బండి వచ్చినతరువాత నలుగురూ దానిలో ఎక్కి కూర్చున్న పిదప "ఆఁ ఆఁ, తరువాత?" అన్నాడు యాదవుడు.

"నేనయితే లేను, సరిగ్గా నాకూ బాగా తెలియదు. నాలుగైదు రోజులు జ్వరం కాసిందట. తరువాత మూర్ఛలు రావటం మొదలుపెట్టినవట. అప్పటినుంచి ఎవరూ మందు సంగతి అటుంచి ఒక్క పాలచుక్క కూడా తాగించలేకపోయారట. ఇప్పుడెలా వుందోగాని, బ్రతుకుతుందని ఆశ లేదు" అన్నాడు మాధవుడు.

"ఆశ లేకపోవటమేమిటి! కావలసినంత వుంది. మా అమ్మ బ్రతుకుతుంది. మాధవ్! భగవంతుడు నాకీ వయసులో

మాట అబద్ధం కానీయడు. నేను నేటివరకు అబద్ధమాడి ఎరుగను!" అని యాదవుడు గట్టిగా అన్నాడు.

మాధవుడు వంగి అన్నగారి పాదాలకు నమస్కరించి మెదలకుండా కూర్చున్నాడు.

౯

బిందు ఎన్నాళ్లనుండి అన్నంతినకుండా కృశిస్తూ వస్తూ వుందో ఆ సంగతి ఎవరూ తెలుసుకోలేకపోయారు. పుట్టింటికి వెళ్ళగానే ఆమెకు జ్వరం వచ్చింది. మరునటిరోజున రెండు మూడుసార్లు మూర్ఛ వచ్చింది. ఆఖరుతడవ వచ్చిన మూర్ఛ తగ్గనేలేదు. అనేక ప్రయత్నాలు చేసినతర్వాత ఆమెకు కొద్దిగా తెలివి వచ్చింది. కాని నాడిమాత్రం కనపడలేదు. ఆ స్థితిలో మాధవుడు అక్కడికి వెళ్ళగా బిందు అతని పాదాలకు నమస్కారం చేసింది. అతను పాలు నోట్లో పోయబోగా పళ్లు గట్టిగా బిగించుకుంది. ఎంత బ్రతిమాలినా ఒక్క చుక్కయినా మింగలేదు.

మాధవుడు హతాశుడై "ఆత్మహత్య ఎందుకు చేసుకుంటావు?" అన్నాడు.

బిందు కనుకొలకులనుండి కన్నీరు కారుతుంది. కొంచెం సేపున్నతరువాత మెల్లగా "నా సర్వస్వమూ అమూల్యుడికివ్వండి. రెండువేలుమాత్రం నరేంద్రుడికివ్వండి—చదివించండి. అతడికి అమూల్యుడంటే ఇష్టం" అన్నది మెల్లగా.

మాధవుడు బలవంతంగా పళ్లు బిగించుకొని దుఃఖాన్నాపుకున్నాడు.

బిందు అతన్ని మరికొంచెం దగ్గరికి రమ్మని సైగచేసి, "అమూల్యుడుతప్ప నా అంత్యకర్మ లెవరూ చేయటానికి వీలులేదు" అన్నది.

మాధవుడీ దెబ్బకూడా తట్టుకొని "ఎవరినైనా చూడాలని ఉందా ?" అని ఆమె చెవులో అన్నాడు.

బిందు తలతిప్పి "లేదు" అన్నది.

బిందుతల్లి వచ్చి ఒకసారి మందియ్యబోగా బిందు అలాగే పళ్లు బిగపట్టుకుని పడుకుంది.

మాధవుడు లేచి నుంచుని "అలా చేయకూడదు. నువ్వు మా మాట వినటం లేదు. నువ్వు ఎవరిమాటయితే తీసెయ్య లేవో వారిని తీసుకురావటానికి వెళుతున్నాను. నేను తిరిగి వచ్చేవరకు మాత్రం ఇలావుండు" అని మాధవుడు బైటికివచ్చి కళ్లుతుడుచుకున్నాడు. ఆరాత్రి బిందు సుఖంగా నిద్రపోయింది.

* * * * *

అప్పుడే సూర్యోదయమవుతూ ఉన్నది. మాధవుడు గదిలోకివచ్చి దీపం పెద్దదిచేసి కిటికీతలుపులు తెరిచాడు. బిందు కన్ను తెరవగానే ఎదురుగా స్నిగ్ధప్రభాతకాంతిలో మగని ముఖంచూచి, చిరునవ్వునవ్వి "ఎప్పుడొచ్చారు ?" అన్నది.

"ఇప్పుడే వస్తున్నాను. అన్నయ్య పిచ్చివాడిలాగ విలపిస్తున్నాడు."

"ఆ సంగతి నాకు తెలుసు. వారి పాదధూళి ఏమైనా తెచ్చారా ?" బిందు మెల్లగా అడిగింది.

"వారు బైటకూర్చుని చుట్ట కాల్చుకుంటున్నారు. వదినగారు కాళ్ళు కడుక్కుంటున్నారు. అమ్మాయ్యాడు బండిలోనే నిద్రపోయాడు. తీసుకువెళ్ళి మేడమీద పందిట్లో పెట్టాను. తీసుకురానా?" అన్నాడు మాధవుడు.

బిందు కొంచెంసేపు స్థిరంగావుండి "వద్దులే పడుకోనీయండి" అని పక్కకు వత్తిగిలి పడుకున్నది.

అన్నపూర్ణ గదిలోకివెళ్ళి మంచం తలవైపున కూర్చుని ఆమె తలమీద చెయ్యివెయ్యగానే ఉలిక్కిపడ్డది బిందు. అన్నపూర్ణ రెండు నిమిషాలు తననుతాను సంబాళించుకొని "మందెందుకు తీసుకోవడంలేదు చెల్లీ? చద్దామనా?" అన్నది.

బిందు జవాబు చెప్పలేదు. అన్నపూర్ణ ఆమె చెవిదగ్గరకు వెళ్ళి "నా గుండెలు పగిలిపోతున్నాయి తెలుసా?" అన్నది.

"తెలుసును అక్కా!" అని బిందు అలాగే మెల్లగా సమాధానం చెప్పింది.

"అయితే మొహం ఇటుతిప్పు. మీ బావగారు నిన్నింటికి తీసుకుపోవటానికి స్వయంగా వచ్చారు. కుర్రాడు ఏడ్చి ఏడ్చి నిద్రపోయాడు. నా మాటవిని మొహం తిప్పు" అన్నది అన్నపూర్ణ.

బిందు అప్పటికీకూడా మొహం తిప్పలేదు. "వద్దక్కా! ముందు..." అని ఏదో అనబోయింది.

ఇంతలోనే యాదవుడు అక్కడికి వచ్చి వాకిటివద్ద నిలబడ్డాడు. అన్నపూర్ణ బిందు పయట సర్దింది. యాదవుడు

నిమిషంసేపు రెప్పవెయ్యకుండా నిండాకప్పివున్న తన వాత్సల్య మూర్తికేసి చూసి కన్నీరు గుడ్లలో కుక్కుకుని "ఇంటికి వెళదాం లే అమ్మా! నేను తీసుకువెళ్ళటానికి వచ్చాను" అన్నాడు.

అక్కడ వున్నవారందరూ యాదవుని మొహం చూసి కన్నీళ్లు పెట్టుకున్నారు. యాదవుడు మరోక్షణం మౌనంగా వుండి "ఒకనాడు, నీ వింతదానవై వుండగా, మా ఇంటికి లక్ష్మి లాగ నిన్ను తీసుకువెళ్ళటానికి వచ్చాను. మళ్ళీ రావలసి ఉంటుందని నే నెప్పుడూ అనుకోలేదు. నా మాట విను. వచ్చినతర్వాత నిన్ను తీసుకువెళ్లాలి—లేకపోతే ఆ ఇంటికేసి తలెత్తిచూడను. నేను అబద్ధమాడనని నీకు తెలుసుగా అమ్మా!" అన్నాడు.

యాదవుడీ మాటలని బైటికి వెళ్ళిపోయాడు. బిందు మొహం ఇటుకేసి తిప్పి "ఇక ఏమి పడతావో పెట్టు అక్కా! అబ్బాయిని నా పక్కలో పండుకోబెట్టి మీరందరూ కొంచెం సేపు బైటికివెళ్ళి విశ్రాంతి తీసుకోండి. ఇంకేం భయం లేదు. నేను చావను" అన్నది.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA128B139 |
| పుస్తకం పేరు | బిందుగారబ్బాయి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | n/o |
| వెనుక అట్ట | n/o |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | n/o |
| ఖాళీ పేజీలు | 92 |
| లేని పేజీలు | n/o |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | |
| స్కాన్ చేసినది | S.Lalitha |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |